# విషయ సూచిక

తిథి ర్వారంచ నక్షత్రం యోగః కరణ మేవచ- పంచాంగమితి విఖ్యాతం లోకోయం కర్మసాధకః
తిథేశ్చ శ్రియమాప్నోతి వారాదాయుష్యవర్ధనం-నక్షత్రాద్ధరతే పాపం యోగాద్రోగ నివారణం
కరణాత్కార్య సిద్ధిశ్చ పంచాంగ ఫలం త్విదం- కాలవిత్కర్మ కృద్ధీమాన్ దేవతానుగ్రహం లభేత్॥

పంచాంగము అనగా 5 అంగములు (అవయములు) కల్గినది. కాలమునకు 5 అవయములు కలవు. తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము ఈ 5ను కాలము యొక్క ఫలమును వెల్లడించును. కార్యమును సాధింపదలచిన జనులు ఈ ఐదింటిని తెలిసికొనవలయును.

తిథులలో నంద భద్ర జయ రిక్త పూర్ణ అను భేదములు గలవు. మరియు పాడ్యమి మొదలగు తిథులకు అగ్ని మొదలగువారు దేవతలు. ఈ భేదములను తెలుసుకొని, ఆయా తిథులయందు నిర్దిష్ట విధానముగా ప్రవర్తించుటవలన సంపదను పొందుచున్నారు. సూర్యాది నవగ్రహముల ప్రభావముచే ఏర్పడిన వారములను తెలుసుకొని ప్రవర్తించుట వలన ఆయువు పెరిగి, కార్యసిద్ధి లభించును.

క్షిప్ర, చర, మైత్ర, మృదు, స్థిర, ఉగ్ర, సాధారణ, చర భేదములు గల్గిన అశ్వనీ మొదలగు 27 నక్షత్రముల విధానములను తెలిసికొనుట వలన పాపము నశించుచున్నది. విష్కంభము మొదలగు 27 యోగములను తెలిసికొనుటవలన రోగ నివారణ జరుగు చున్నది. బవ మున్నగు 11 కరణములను తెలిసికొనుట వలన కార్యసిద్ధి అగును.

**తిథులు :-** ప్రతిపత్, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, (పూర్ణిమ), అమావాస్య, అవమా, త్రిద్యుస్పృక్ - ఈ తిథులు అశుభప్రదములు.

**వారములు :-** ఆదివారము, మంగళవారము, శనివారము అశుభప్రదములు.

**నక్షత్రములు :-** భరణి, కృత్తిక, పునర్వసు, ఆశ్లేష, మఖ, పూర్వఫల్గుణి, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, జ్యేష్ఠ - ఈ నక్షత్రములు అశుభప్రదములు.

**యోగములు :-** విష్కంభము, గండము, అతిగండము, శూలము, వ్యాఘాతము, పరిఘ పూర్వార్థము, వ్యతీపాత్, వైధృతి - ఈ యోగములు అశుభప్రదములు.

**కరణములు :-** (విష్టి) అశుభప్రదము, భద్ర మంగళప్రదము.

బహుళ తృతీయ, దశమి ఉత్తరార్థము - రాత్రియందును, సప్తమి, చతుర్దశి పూర్వార్థము - పగటియందును వున్న విష్టి మంచిదికాదు. పూర్ణిమ పూర్వార్థపు విష్టియును మంచిది కాదు.

ఈ విధముగ తిథి, వారము మున్నగు కాలస్వరూపము ఫలితములను తెలుసుకొని ఆయా కర్మలను చేయు బుద్ధిమంతులు దేవతల దయను పొందుదురు. ఇందువలన జ్యోతిషము నెరిగిన వారి నుండి ప్రతిదినము పంచాంగ ఫలితములు నెరుగుట వలన మానవులకు శ్రేయస్సు కలుగును. అభీష్టసిద్ధి కలుగును.





శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

శ్రీ మహాలక్ష్మీగణపతయే నమః శ్రీమద్వేంకటేశ్వరాయ నమః

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే ॥

ఓమ్॥ ఈశానాం జగతో౽స్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థలనిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్॥

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥

## నవగ్రహ స్తోత్రములు

1. రవి : జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్
తమో౽రిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్॥ 6 వేలు

2. చంద్ర : దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవమ్
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం ॥ 10 వేలు

3. కుజ : ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహం॥7 వేలు

4. బుధ : ప్రియంగు కలికాశ్యామం రూపేణా౽ప్రతిమం బుధం
సౌమ్యం సత్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం॥17వేలు

5. గురు : దేవానాంచ ఋషీణాంచ గురుంకాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం॥ 16వేలు

6. శుక్ర : హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం॥ 20 వేలు

7. శని : నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం॥ 19వేలు

8. రాహు : అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్దనం
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహం॥18వేలు

9. కేతు: పలాశపుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకం
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం॥7వేలు

పై గ్రహమంత్ర స్తోత్రముల పఠనం వల్ల మీమీ దారిద్ర్య దుఃఖ బాధలు, పీడలు, శారీరక మానసిక రోగరుగ్మతలు తొలగును. సర్వకార్య విజయాలు, విద్యా ఉద్యోగ వ్యాపారాది లాభాలు, మనోవాంఛలు తీరును.






శ్లో॥ బాలార్క కోటి ద్యుతిమప్రమేయం బాలేందు రేఖా కలితోత్తమాంగం ।
భ్రమద్ద్విరేఫావృత గండభాగంభజే భవానీ తనయం గణేశమ్ ॥

| | | | |
|---|---|---|---|
| కలియుగాబ్దములు | 5125 | శ్రీ శంకరాచార్యాబ్దములు | 2096 |
| విక్రమార్క శకాబ్దములు | 2081 | శాలివాహన శకాబ్దములు | 1946 |
| ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతారణాబ్దములు | 10 | శ్రీరామానుజాబ్దములు | 1007 |
| తెలంగాణా రాష్ట్ర అవతరణాబ్దములు | 10 | మధ్వాచార్యాబ్దములు | 908 |
| భారతదేశ స్వతంత్రాబ్దములు | 77 | ఇంగ్లీషు | 2024-2025 |

## సంవత్సర ఫలితము

ఈ సంవత్సరము రాజు, అపరసస్యాధిపతి, నీరసాధిపతి కుజుడు. మంత్రి, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి శని. పూర్వసస్యాధిపతి చంద్రుడు. రసాధిపతి గురుడు. నవనాయకులలో ఇరువురు శుభులు, మిగిలిన ఏడుగురు పాపులు. పగటి యందు రవి ఆర్ద్రా ప్రవేశము సస్యనాశనము, జగద్విపత్తు, ధరలు తగ్గును. పశుపాలకుడు, గోష్ఠాగారప్రాపకుడు యముడు. గోష్ఠాద్బహిష్కర్త బలరాముడగుటచే వ్యవసాయం, పాడిపంటలపై శ్రద్ధ తక్కువ. మొత్తం రెండు తూముల వర్షం అనగా ఇరువది భాగములలో సముద్రముల యందు తొమ్మిది భాగములు, పర్వతముల యందు తొమ్మిది భాగములు, మిగిలిన రెండు భాగములు భూమిపై కురియును. ఎర్రని పర్వతప్రాంత భూములు బాగుగా ఫలించును. ధాన్యాదులకంటే ఫలపుష్పాదుల ఉత్పత్తి అధికమగును. మొత్తం 16 వీసములకు 7 వీసముల పంట ఫలించును. జ్యేష్ఠ శుక్లమున తొలకరించును.

## కర్తరీ నిర్ణయము

దీ.4-05-2024 చైత్ర బహుళ ఏకాదశి శనివారం పగలు గం. 12-35 ని.లకు డొల్లుకర్తరి ప్రా.

దీ.11-05-2024 వైశాఖ శుద్ధ చవితి శనివారం ఉదయం గం. 10-21 ని.లకు నిజకార్తరి ప్రా.

దీ 28-05-2024 వైశాఖ బహుళ షష్ఠి మంగళవారం రాత్రి గం. 7-23 ని.లకు కర్తరి త్యాగం.

## మౌఢ్య నిర్ణయము

1-05-2024 చైత్ర బహుళ నవమి బుధవారం రాత్రి గం. 3-35 ని.లకు అనగా తెల్లవారితే గురువారం ప్రాగస్తమిత శుక్ర మౌఢ్యారంభం.

5-05-2024 చైత్ర బహుళ ద్వాదశి ఆదివారం ఉదయం గం. 7-38 ని.లకు పశ్చాదస్తమిత గురు మౌఢ్యారంభం.

1-06-2024 జ్యేష్ఠ బహుళ దశమి శనివారం రాత్రి గం. 7-12 ని.లకు ప్రాగుదిత గురు మౌఢ్య త్యాగము.

7-07-2024 ఆషాఢ శుద్ధ విదియా ఆదివారం సాయంత్రం గం. 5-18 ని.లకు పశ్చాదుదిత శుక్ర మౌఢ్య త్యాగం.

18-03-2025 ఫాల్గుణ బహుళ చవితి మంగళవారం ఉదయం గం. 7-15 ని.లకు పశ్చాదస్తమిత శుక్ర మౌఢ్యారంభము.

28-03-2025 ఫాల్గుణ బహుళ చతుర్దశి శుక్రవారం ఉదయం గం. 6-33 ని.లకు ప్రాగుదిత శుక్ర మౌఢ్య త్యాగము.

## నర్మదానది (రేవా) పుష్కర నిర్ణయము

## ది.1-05-2024 నుండి 12-05-2024 వరకు

ది.1-05-2024 చైత్ర బ.అష్టమి బుధవారం మధ్యాహ్నం గం.1-0లకు నర్మదా నది పుష్కర ప్రా. దేవగురుడు బృహస్పతి వృషభరాశి యందు ప్రవేశించుటచే నర్మదా నదికి పుష్కరములు ప్రారంభమగును. సార్ధ త్రికోటి దేవతా సహితముగా బృహస్పతి ఈ నదిలో నివసింతురనుటచే ఈ పండ్రెండు రోజులు స్నాన జప దాన తర్పణ పిండ ప్రదానములు చేయుట వలన పితృ దేవతలు తరించి కుటుంబ వృద్ధి బడయుదురు. మహా నదిలో ఎప్పుడు స్నానం చేసిననూ సంకల్ప పూర్వకముగా చేసిన ఆ స్నానము అఘమర్షణ స్నానమగుననియూ, కేవలము శరీర శుద్ధి కోసము చేయు స్నానము మలమర్షణ స్నానమే అగునని ఆర్యుల వాక్యము. పితృదేవతలు తన సంతానము సంపాదించిన ధనమును చూసి గాక, వారు నిజాయితీతో ఆచరించు కార్యములకు, సంతానం చేయు త్యాగములకు, దానములకే సంతృప్తి చెందుదురు యనుటచే ఇది సమాజములో అందరికీ వర్తించుననుటచే, ఇలా యథా శక్తిగా జేసినవారు కుటుంబ వృద్ధిని పొందుదురు.

నర్మదానదికి చెందిన తీర్థములలో ఓంకార, కపిలా, సంగమ, అమరేశ తీర్థములను స్మరించినంతనే పాపములు నశించి అఖండ పుణ్యము కలుగును. కనఖల క్షేత్రమున గంగానది, కురుక్షేత్రమున సరస్వతి, ఇతర ప్రదేశముల యందు కంటే అధిక పుణ్య ఫలప్రదములు. కాని నర్మదానది ప్రవహించినంత మేర అది గ్రామమైనను, నగరమైనను, అరణ్యమైనను, యెట్టి ప్రదేశమైనను అధిక పుణ్యఫలప్రదమే. అమరకంటక పర్వతము వరకు ఉన్న నర్మద ముల్లోకముల యందలి అన్ని నదులకంటే మరింతగా మనసు నాకర్షించును. దేవదానవులు,



గంధర్వాదులు, ఋషులు అందరును నర్మదలో స్నానమును చేసి తీరమున తపమాచరించునట్లు తెలియుచున్నది. నర్మదా నదీస్నానము చేసి నియమముగా ఒకరాత్రి యుపవసించి యున్నవాని వంశము వారు నూరు తరాలవారు తరింతురు.

## క్రోధి వత్సర ఫలం

సస్య వృద్ధి బాగుగా యుండును. దంపతులు పరస్పరము వైరము విడిచి సంయమనముగా ఉండవలెననుట. పాలకులు స్వార్థ బుద్ధితో ఉందురు. వారి మధ్య ఘర్షణ వాతావరణము ఉండును.

## సావన వర్ష ఫలము

సావనవర్షాధిపతి రవియగుట వలన దేశాలు గొప్ప సేనలతో శత్రు దేశములపై దండెత్తుట యుద్ధవాతావరణము యుండును. సమాచార వ్యవస్థ కుంటుపడును. దేశముల మధ్య  రాయబారవ్యవస్థలు విఫలమగును. మధ్యవృష్టి కల్గును.

## గురూదయవశాత్ వర్ష ఫలము

గురూదయవశమున కార్తీకాబ్దమగుటచే అగ్ని వలన అనగా కమ్మర పని చేయువారికి, గోవులవలన, బండ్ల వలన జీవించువారికి పీడ కలుగును. శస్త్రముల వలన అగ్ని వలన మరియు ఆకలిభయములు పెరుగును. పుష్పమాలాకారులు, పుష్ప వ్యాపారములవారు సుఖ జీవనము పొందెదరు.

## బార్హస్పత్యమాన ఫలము

బార్హస్పత్యమానముచే నలనామ సంవత్సరమగుట వలన సస్యములు మధ్యమ ఫలములు. ధరలు సమముగా యుండును. వర్షములు సమముగా యుండును. పాలకులు సంక్షోభములను ఎదుర్కొనెదరు. అగ్ని ప్రమాదములు అధికముగా సంభవించును.

## మేష సంక్రమణ ఫలము

ది.13-04-2024 చైత్ర శుద్ధ పంచమి తత్కాల షష్ఠి శనివారం రాత్రి 11-17 ని.లకు రవి మేష రాశి ప్రవేశం. అల్ప వర్షం. వెలలేని కలహములు అగ్నిభయము.

## రవి ఆర్ద్రా ప్రవేశ ఫలము

ది.22-06-2024 జ్యేష్ఠ బహుళ పాడ్యమి శనివారం ఉదయం గం. 8-10 ని.లకు రవి ఆర్ద్రా నక్షత్ర ప్రవేశం. పగటి యందు ఆర్ద్రా ప్రవేశము సస్యనాశనము, జగద్విపత్తు, మందకరము ధరలు తగ్గును. మూల నక్షత్రమందు రవి ఆర్ద్ర ప్రవేశము శుభదాయకము శుక్ల యోగం వృష్టిని తెలియజేయును. బాలువ సుభిక్షమును ఇచ్చును. పూర్ణ జలారాశియగు కర్కాటక లగ్నమున ఆర్ద్రా ప్రవేశము పంటల వృద్ధిని తెలియజేయును.

## పశుపాలక వర్షవర్షాదిక నిర్ణయం

పశుపాలకుడు, గోష్ఠాగారప్రాపకుడు (స్థాన సంరక్షకుడు) యముడు, గోష్ఠాదృహిష్కర్త బలరాముడు ధరలు తగ్గుట, స్వల్ప వృష్టి అల్ప క్షీరము స్వల్ప పంటలు, విత్యము పశుపీడ, పశువులు గ్రాసము కొరకై అల్లాడుచుండును. అధికము వేశ్య హస్తగతమై యుండును. ఈ కాలమున ధాన్యాది వస్తువుల ధరలు తగ్గును. మంచి వర్షములు కురియును. వృద్ధాప్య దశయందు యుండుటచే సస్యానుకూల వర్షములు పాడిపంటల సమృద్ధి ప్రజలు సుఖ సౌఖ్యములు అనుభవించుట, ధాన్యాదుల ధరలు తగ్గుట, ఉత్పత్తి అధికమగుట వలన ధరలు తగ్గును.

## సూర్య / చంద్ర గ్రహణములు

ఈ క్రోధినామ సంవత్సరములో మన ఆంధ్ర, తెలంగాణా ప్రాంతములలో గాని దేశమందు యే ఇతర రాష్ట్రములందు గాని సూర్య చంద్ర గ్రహణములు గోచరించవు.

## గ్రహములకు మిత్రత్వ శత్రుత్వములు

| గ్రహములు | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చ,కు,గు | ర,బు | ర,చం,గు | రవి, శుక్ర | రవి,చం,కు | బుధ,శని | బు,శు |
| శత్రువులు | శుక్ర,శని | లేరు | బుధ | చంద్ర | బు, శుక్ర | రవి,చం | ర,చ,కు |
| సములు | బుధ | కు,గు,శు,శ | శుక్ర, శని | గు,శ,కు | శని | కు,గురు | గురు |

ఫలం :- వధూవరుల రాశ్యధిపతులు ఒకరైనను, ఏకరాశ్యాధిపత్యము కలిగియున్నను శుభప్రదము. శత్రువులైన పరస్పరము కలహము కలవారగుదురు. నైసర్గిక మిత్రులు తాత్కాలిక శత్రువులైనను, నైసర్గిక శత్రువులు తాత్కాలిక మిత్రులైనను సములగును. నైసర్గిక సములు తాత్కాలిక శత్రువులైన శత్రువులే. తాత్కాలిక మిత్రులు అయిన మిత్రులే.

**జల నక్షత్రములు :** పునర్వసూ చతుర్థపాదము, పుష్య, ఆశ్రే, శ్రవణ, ధనిష్ఠ పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

**జల రాశులు :** వృషభ, కర్కాటక, వృశ్చిక, మకర, కుంభ, తుల, మీనములు.

**నిర్జల రాశులు :** మేష, మిధున, సింహ, కన్య, ధనుస్సులు.

**తిర్యఙ్ముఖ నక్షత్రములు :** అశ్విని, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, రేవతి ఈ నక్షత్రములు గృహ స్తంభన ప్రతిష్ఠలకు శుభప్రదములు.

**అధోముఖ నక్షత్రములు :** భరణి, కృత్తిక, ఆశ్రేష, మఘ, విశాఖ, మూల, పూర్వా త్రయం, ఉత్తరాత్రయం నక్షత్రములు వాపీకూప తటాకాదులకు శుభములు.

**ఊర్ధ్వముఖ నక్షత్రములు :** రోహిణి, ఆర్ద్ర, పుష్య, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, ఉత్తరాత్రయం, ఈ నక్షత్రములు వృక్షలతాదులకు శుభములు.



# సంవత్సర ఫలిత సారాంశము

| | | |
|---|---|---|
| | గు | చం శు ర బు రా కు శ |
| | వర్ష లగ్నం | |
| కే | | లగ్నం |

| | | |
|---|---|---|
| చం | ర గు | బు శు రా కు శ |
| | జగ ల్లగ్నం | |
| కే | | లగ్నం |

అస్మిన్దేశే లోకవ్యవహారతః చాంద్రమాన వశాదయం క్రోధినామ సంవత్సరః బార్హస్పత్యమానేన కాశీ ప్రాంతే నల నామ సంవత్సరః ప్రభావాది 60 సంవత్సరములలో 38వది క్రోధి సంవత్సరము. అరిషడ్వర్గాలలో ఒకటైన క్రోధము ఇతరులకు అసహనాన్ని కలిగించేది, కోప స్వభావాన్ని పెంచేది ఈసంవత్సరం క్రోధినామ సంవత్సరము. 1 యుగమునకు 5 సంవత్సరముల చొప్పున 60 సంవత్సరములను 12 యుగములుగా విభజిస్తే శ్రీ క్రోధి నామ సంవత్సరము 8వ యుగమున 3వది ఇడావత్సర నామకము గలది అనలదేవతాకమైనది. ఈ క్రోధినామ సంవత్సరమునకు అధిపతి శనైశ్చరుడు. అధిదేవత ప్రత్యధిదేవత సహితముగా నియమపూర్వకంగా పూజిస్తే శుభఫలితాలు కల్గుతాయి. గ్రహదేవత భౌతికతత్వాన్ని తెలియజేస్తే, అధిదేవత గ్రహము యొక్క ప్రవృత్తిని, ప్రత్యధిదేవత, గ్రహదేవత యొక్క ప్రభావాన్ని ఉన్నత స్థాయిలో సత్ఫలితాలనిచ్చేటట్టు చేస్తుంది. ఆయుర్దాయం కల్పించడం, సత్యాన్ని ధర్మాన్ని పరిరక్షించడం, క్రమ శిక్షణా రాహిత్యానికి, నేరాలకు బంధనయోగాన్ని కల్పించడం, దోషులకు శిక్షలు విధించడం, న్యాయవ్యవస్థ, న్యాయపాలనం చేయడం, తత్సంబంధ అధికారాలు కృషి, జీవనం, నల్లని ధాన్యాలు, హూణ విద్య, జీవనోపాయం, జైలు, న్యాయపాలనం, అనాచారం, నల్లనిధాన్యములు, దుష్ప్రవర్తన, నీచజీవనము, హూణవిద్య, కృషి, జీవనం, ఈ విషయాలను ప్రభావితం చేసే కారకత్వాలున్న శని వర్ష జగల్లగ్నమైన ధనూరాశికి ఉపచయ స్థానమందు ఉండుటవలన దేశమున ప్రాయోజనకారియగు ఫలితముల నీయును. శ్రీ క్రోధినామ సంవత్సరంలో మే 1 నుండి వృషభంలో గురుని సంచార ప్రభావం దేశ ఆర్థిక స్థిరత్వాన్ని, మేధో సంపద వృద్ధిని తెలియజేస్తుంది. అనేక రకములైన ఆర్థిక వనరులను పెంచి సుసంపన్నము చేసి ఆర్థిక సుస్థిరత్వాన్ని కలిగిస్తుంది. దేశంలో వర్షాలు తక్కువ. కూరగాయలు ఆహారపదార్థాలు ఎక్కువ ధరలు పలుకుతాయి. పలుప్రాంతాలలో మరియు కర్మాగారాలు గిడ్డంగులు అగ్ని ప్రమాదాలకు గురయ్యే అవకాశం ఉంది. వర్ష లగ్నము ధనుస్సు గురుడు అధిపతి. గురుడు కోణాధిపత్యముచే శుభుడు, లగ్నమునకు శుభగురుని వీక్షణ, గురుడు, భాగ్యరాశియైన మేషరాశి యందు ఉభయ కేంద్రాధిపతియైన బుధునితో కలయిక కేంద్ర కోణాధిపతుల కలయిక శుభయోగమనుటచే రాజయోగము

ద్వితీయాధిపతి శని పంచమ వ్యయాధిపతి యగు కుజునితో తృతీయమందు సమాగమము, దేశమున అధిక ధన వ్యయము ప్రజలు ఖర్చునకు వెనకాడకుండుట, అధిక ఖర్చులతో జీవనము భారమగుట, అయిననూ ఆనందము పొందుట ధైర్యముగా వ్యవహరించి కార్యోన్ముఖులగుట, లక్ష్యసాధన చేయుటకు కారకగ్రహములైన కుజ శనులు తృతీయ స్థానమందు సమాగమము విశేషము ఇది అనుకూలమైన ఫలితాలను ఇస్తుంది. కార్యభారాన్ని వహించి ధైర్యంగా నిర్దిష్ట లక్ష్యాలను సాధించగల సామర్థ్యాన్ని కలిగి ఉంటారు. గత సంవత్సరం కంటే దేశంలో విద్యాసంస్థల పనితీరు, ప్రతిభా సూచికలో వృద్ధి కనబడుతుంది. దేశంలో కొత్త రసాయనిక శాలలు, పరిశోధన కేంద్రాలు ఏర్పాటు.చేయబడతాయి.

లగ్నాత్, పంచమ స్థానమందు లగ్నాధిపతి గురుడు మరియు ఉభయకేంద్రాధిపత్యముచే పాపియైన బుధుడు,ఈ స్థానానికి శనైశ్చరుని దృష్టి, కేంద్ర కోణాధిపతుల కలయిక రాజయోగాన్ని తెలియజేస్తోంది. విద్యా సంస్థలవృద్ధి, ఈ సంస్థలపై ప్రభుత్వ అజమాయిషీ, నియంత్రణ, శ్రద్ధ, శిశు సంక్షేమం, పాలకుల మానసిక స్థితి బాగుంటుంది. అరాచకాలకు అడ్డుకట్ట వేస్తారు. పర్వతాలు అడవుల రక్షణకు తగిన చర్యలు తీసుకుంటారు. రక్షణ నిల్వలు పెరుగుతాయి. పరిశోధనారంగ సంస్థల కృషి విశేషంగా ఉంటుంది.

ప్రజారోగ్యము కనీస స్థాయిలో సామాన్యంగా ఉంటుంది. ఔషధములు, వైద్యము ఖరీదగుట, వైద్యవిధానాలపై , ప్రభుత్వ సంస్థల అజమాయిషీ లోపించడం జరుగుతుంది. దేశప్రజల ఆరోగ్యవిధానముపై శ్రద్ధ అవసరము. వర్షజగల్లగ్నములందు కుంభ రాశి యందు కుజ శనులు సమాగమము దేశమందు స్ఫోటకము మొదలైన భయంకర అంటువ్యాధులు వచ్చు అవకాశము కలదు.

ఇతరదేశాలతో మెరుగైన సంబంధాలు ఉంటాయి. విదేశీ దౌత్య సంబంధ విషయాల్లోనూ మన దేశం చొరవ చూపి ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉంటుంది. ఆర్థిక నేరాల కనీస స్థాయికి వస్తాయి. వైవాహిక వ్యవస్థ గతం కంటే మెరుగవుతుంది. మతపరమైన దీర్ఘ కాళికప్రణాళికలను ప్రభుత్వం ఆచరిస్తుంది. ప్రభుత్వ నిర్ణయాలు ప్రజానుగుణంగా ప్రజాభీష్టానికి తగినట్టుగా ఉంటాయి. దేశ సార్వభౌమాధికారం విషయంలో రాజీ ఉండదు. ప్రజల సంస్కృతి, కట్టుబాట్లకు దేశీయమైన సంస్కృతి పునరుద్ధరించటం మొదలగు విధానాలకు ప్రాధాన్యత ఇస్తారు. సైబర్ సంబంధ నేరాలు ఎక్కువ అవకుండా పటిష్టమైన భద్రతా చర్యలు తీసుకుంటారు. అంతర్గత శత్రువులైన ఉగ్రవాదులు, ఆర్థిక నేరగాళ్ల పాత్ర కనీస స్థాయిలో ఉంటుంది. పరిహద్దు వద్ద చర్య ప్రతిచర్యలు కవ్వింపు చర్యలు యుద్ధ వాతావరణాన్ని తలపిస్తుంది. దేశంలో నేరాలు హత్యలు తగ్గుముఖం పడతాయి.

షేర్ల మార్కెట్ తరచూ పతనం అవుతూ ఉంటుంది. రవాణా రంగం రైల్వే, వైమానిక, సేవల ద్వారానూ ఆర్థిక వ్యవస్థ మెరుగ్గా ఉంటుంది. పన్నుల రూపం లోనూ వైజ్ఞానికపరంగానూ పరిశోధన రంగం ద్వారానూ, ఔషధ కంపెనీల ద్వారాను, ఆదాయపుపన్ను, స్థిరాస్థి పన్నులు మొదలగు అనేక రకాలైన పన్నుల రూపంలోనూ ఇబ్బడి ముబ్బడిగా ఆదాయం ప్రభుత్వానికి సమకూరుతుంది.



ఔషధ ఉత్పత్తి కర్మాగారాలలో, రసాయనిక కర్మాగారాలలో అగ్నిప్రమాదాలు వచ్చే అవకాశం ఉంది. డిసెంబర్, జనవరి, ఫిబ్రవరి నెలలో ప్రజలకు శీతలవాయు ప్రభావము వలన కంఠము మరియు ముఖ సంబంధ అనారోగ్యములు, భయము ఉంటుంది.

కమ్మరి, కంసాలి, బంగారం పనివారలకు, వంటల పనులు చేయువారలకునూ కష్టములు తప్పవని తోచుచున్నది. పశువులకు పీడలు కల్గునని తెలియుచున్నది. ప్రజలకు శస్త్రముల వలన భయము, రోగభయము కలుగును. పసుపు ఎరుపు పుష్పములు వృద్ధి చెందును. అక్టోబర్ 9 నుండి నవంబర్ 15 ల మధ్య వరుసగా గురు శనుల వక్రం, డిసెంబర్ 6 నుండి ఫిబ్రవరి 4ల మధ్య తదుపరి మార్చి 15 లగాయితు సరిహద్దు వాతావరణం ఉధృతంగా ఉంటుంది.

వృషభరాశి యందు గురుని సంచార ఫలమును పరిశీలించిన దేశ ఆర్థిక వ్యవస్థ సుస్థిరతను సాధిస్తుంది. మేధావుల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. దేశానికి ప్రయోజనం చేకూరుతుంది. శని శతభిషం నక్షత్రమందు సంచరించుటచే రాజమంత్రులకు, ప్రభుత్వ సలహాదారులకు, వైద్యులకు, కవులకు హాని కలిగించును. పూర్వాభాద్ర నక్షత్రమున శని సంచారము తమిళనాడు ప్రాంతము వారికి, నీతిమంతులకు హాని కలిగించును. శని కుంభరాశి యందు సంచారముచే వర్షాభావము రాజభయము సస్యహాని ప్రజాక్షయము కల్గును. బెంగాల్, కాశ్మీరం, ఒరిస్సా రాష్ట్రములందు ప్రకృతి విపత్తుల వలననూ, రాజకీయ పరమైన సంక్షోభమును ఎదుర్కొంటాయి.

శ్రీనివాసుని పాదపద్మాలచెంత శిరస్సులను ఉంచి అర్పణభావంతో ఉండటం ద్వారా గంగాస్నాన విశేష పుణ్యఫలాలను పొందువారలై బ్రహ్మమహేశ్వరులచే అర్చింపబడే శ్రీమద్వేంకటేశ్వరుని పాదపద్మాలను సేవించువారలు, రుచిరమైన శ్రేయస్సునూ, సౌఖ్యములనూ ఈ క్రోధినామ సంవత్సరంలోని దుష్ఫలితములను అధిగమించి రక్షణ పొందెదరుగాక! జగద్గురువైన శ్రీకృష్ణభగవానుడు,లోకానికి వెలుగునిచ్చే సూర్య భగవానుడు,కలియుగదైవం శ్రీనివాసుడు లోకమునకు శాంతి సౌభాగ్యము,రక్షణ, సన్మార్గములను కలిగింతురుగాక!

| సంవత్సర ఫలితము | | | | |
|---|---|---|---|---|
| అశ్విని | పుష్యమి | స్వాతి | అభిజిత్ | ఆయుర్వృద్ధి |
| భరణి | ఆశ్రేష | విశాఖ | శ్రవణం | అర్థలాభము |
| కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ఠ | మనస్తాపము |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శతభిషం | రాజపూజ్యత |
| మృగశిర | ఉత్తర | మూల | పూర్వాభాద్ర | యుద్ధభయము |
| ఆర్ద్ర | హస్త | పూర్వాషాఢ | ఉత్తరాభాద్ర | అలంకార ప్రాప్తి |
| పునర్వసు | చిత్ర | ఉత్తరాషాఢ | రేవతి | రోగభయము |

# రాజాది నవనాయక ఫలములు

1. **రాజా కుజుడు :** రాజా కుజుడగుటచే అగ్నిభయము, శస్త్ర భయము, పంటలు తగ్గుట, అల్పవృష్టి చోరులు దుర్మార్గులు ప్రబలుట యుండును. పాలకులు, సైన్యమునకు నష్టములు, పరస్పర జయ కాంక్షచే యుద్ధము చేయుదురు. యుద్ధ తీవ్రత, లోకమున భయోత్పాతము అధికము.
2. **మంత్రి శని :** శని మంత్రి యగుటచే వర్షములు తక్కువై పంటలు తగ్గును. చోర, రోగాగ్ని బాధలు, ప్రజలు ధన ప్రజలు దుర్మార్గులచే పీడింపబడుదురు. ధాన్యాదుల ధరలు పెరుగును. మాన ప్రాణ హానులు కలిగి యుందురు.
3. **సేనాధిపతి శని :** సేనాధిపతి శనియగుటచే రాజులకు యుద్ధమందు సైన్యములు నశించును. ప్రజలు న్యాయపరులు. నల్లని ధాన్యములు, నల్లని భూములు బాగుగా ఫలించును. యుద్ధ తీవ్రతచే సకల దేశవాసులు చలించెదరు. నానా విధముల భయముండును. వ్యాపార ఒడిదుడుకులు రవాణా సౌకర్యములు తగ్గి యుండుటచే ధాన్యాదుల ధరలు పెరిగి యుండును. రాజకీయ ఒడిదుడుకులు కలుగును.
4. **అర్ఘాధిపతి శని :** వర్షములు సామాన్యము. దొంగలు, అగ్ని రోగములు వలన పీడ. ఆహార ధాన్యముల కొరత యేర్పడును. రాజకీయ ఒడిదుడుకులు, ప్రజాక్షోభ యుండును. నల్లని భూములు, నల్లని ధాన్యములు నువ్వులు మినుములు బొగ్గు, సీసం, చర్మములు, ఇనుము, తారు, నల్లమందు, నల్ల అవిసెలు, నల్లవాలకు ధరలు సరసమగును.
5. **మేఘాధిపతి శని :** వర్ష ప్రతిభంధకము, రాజులకు ధనాభావము, చలిబాధలు, ప్రజలకు చలిజ్వరములు, ఆహారధాన్యముల కొరత వ్యాధులు ప్రబలుటయు కలుగును.
6. **పూర్వ సస్యాధిపతి చంద్రుడు :** చంద్రుడు పూర్వ సస్యాధిపతియగుటచే జల ధాన్యములు మాగాణి మెట్టపంటలు బాగుగా ఫలించును. పూర్వాపరా సస్యములు ఫలించును. వృక్షజాతులు చక్కగా ఫలించును. చింతపండు, మామిడి పండ్లు, పనస, నారింజాది ఫలములు, గోధుమలు, మంచి ధాన్యములు, జొన్నలు, సజ్జలు, చెరుకు, ఉప్పు, తమలపాకులు మొదలగువాని ధరలు సరసముగా యుండును.
7. **అపర సస్యాధిపతి (ధాన్యాధిపతి) కుజుడు :** ముల్లుగల ధాన్యములు, కందులు, బొబ్బర్లు, మిర్చి, వేరుశెనగ, ఎర్రని ధాన్యములు, ఎర్రని భూములు ఫలించును. మంచి ధాన్యమునకు చెరుకు, బెల్లం, పంచదార, నెయ్యి, నూనెగింజలు, నూనెలు, వేరుశెనగ, ఆముదము, ధరలు పెరుగును. ఆహారధాన్యములకు ధరలు పెరుగును.
8. **రసాధిపతి గురుడు :** బంగారము, వెండి, నెయ్యి, పట్టు, ప్రత్తి, బెల్లం, పంచదార, చెరకు, వస్త్రములకు, ధరలు తగ్గి ప్రజలకందుబాటులో నుండును. అత్యధిక వర్షములుండును. పాడిపంటల సవృద్ధియగును.
9. **నీరసాధిపతి కుజుడు :** పుష్ప వృక్షములు, ఫలవృక్షములు, ఫల పుష్పాదులతో గూడి యుండును. బంగారం, మనులు, రక్తచందనం, కట్టెలు, వీటికే ధరలు హెచ్చుతగ్గులధికమై తగ్గియుండును. మిర్చి పొగాకు ఇనుము ఉక్కు యంత్ర పరికరములు, రాగి, ఇత్తడి, కంచు మొదలగువాని ధరలు పెరిగి నిలబడును. అపరాధాన్యముల ధరలు హెచ్చును. ధాన్యము, బియ్యము ధరలు కంట్రోలు వల్ల తగ్గియుండును.

## పురోహితాది ఉపనాయక నిర్ణయము

పురోహిత, గణక, పరీక్షకాది ఉపనాయక గ్రహములు శుభులు శుభఫలితములను, పాపులు పాప ఫలితములను ఇచ్చెదరు.

| | | |
|---|---|---|
| పురోహితుడు - కుజుడు | పశ్వాధిపతి - శని | మృగాధిపతి - శుక్రుడు |
| అశ్వాధిపతి - శని | జంగమాధిపతి - కుజుడు | రాష్ట్రాధిపతి - కుజుడు |
| రత్నాధిపతి - శని | గ్రామనాయకుడు - శని | గ్రామపాలకుడు - కుజుడు |
| పరీక్షకుడు - కుజుడు | దేవాధిపతి - కుజుడు | శుభాధిపతి - కుజుడు |
| గజాధిపతి - కుజుడు | సర్పాధిపతి - బుధుడు | సర్వదేశోద్యోగి - శని |
| వృక్షాధిపతి - చంద్రుడు | దైవజ్ఞుడ - శుక్రుడు | వస్త్రాధిపతి - గురుడు |
| గణకుడు - బుధుడు | నరాధిపతి - శని | స్త్రీణామాధిపతి - శని |

**21 మందిలో శుభులు 6 పాపులు 15**

## మకరసంక్రమణ పురుషలక్షణము


పులి వాహనం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ క్రోధినామ సంవత్సర పుష్య బహుళ పాడ్యమి మంగళవారం అనగా 14-01-2025 తేదీ మధ్యాహ్నం గం.2-45లకు పునర్వసు నక్షత్రం, విష్కంభం యోగం, బాలువ కరణం లో రవి మకరరాశి ప్రవేశం.

అస్య పురుషస్య లక్షణం - ఫలం
మంగళ వారం :
మహోదర నామము - చోరుల నాశనము,
బిల్వదళ ఉదక స్నానము - మారేడు దళముతో స్నానము చేయుటచే మహా భీతి కల్గును.
బాలువ కరణము - రక్త వస్త్ర ధారణ, రోగదాయకం.
చందన గంధ లేపనము - విప్రనాశనము
జాజీ పుష్పాధారణ - మంచి శోభను కలిగించును.
ముత్య ధారణము - శుభదాయకము.
రజిత పాత్రయందు భుజించుట - సుభిక్షము
పాయస భక్షణం - పశునాశనం
అరటి పండు - ఫలనాశనము
భిండి ఆయుధము - చతుష్పాద జీవులకు నాశనము

అస్య పురుషస్య లక్షణం - ఫలం
ఎరుపు రంగు ఛత్రము - మహాయుద్ధ దాయకము,
వాహనము పులి - అరణ్యమృగ నాశనము,
క్రోధ ముఖము - జన నాశనకరము,
కూర్చునియుండు అవస్థ - మధ్యమ ధరలు కలుగును,
దక్షిణ దిగ్యానము - దక్షిణ దేశములందు విపత్తు, రాజవిద్వరం,
కృష్ణపక్షం - దేశము క్షేమ ఆరోగ్యములతో యుండుట
బహుళ పాడ్యమి - శుభప్రదము
మంగళవారం - వ్యాధుల వలన, దుర్భిక్షము వలన, దొంగల వలన భయము,
అపరాహ్ణ కాలము - శూద్ర నాశనము
వృషభ లగ్నము - సుఖ దుఃఖాసక్తి
ముహూర్తము - సూర్యోదయాది 12 వది సుభిక్షము.

# రాజాది నవనాయక ఫలములు

1. **రాజు కుజుడు :** రాజు కుజుడగుటచే అగ్నిభయము, శస్త్ర భయము, పంటలు తగ్గుట, అల్పవృష్టి చోరులు దుర్మార్గులు ప్రబలుట యుండును. పాలకులు పరస్పర జయ కాంక్షచే యుద్ధము చేయుదురు. సైన్యమునకు నష్టములు, యుద్ధ తీవ్రత, లోకమున భయోత్పాతము లధికము.
2. **మంత్రి శని :** శని మంత్రి యగుటచే వర్షములు తక్కువై పంటలు తగ్గును. ప్రజలు దుర్మార్గులచే పీడింపబడుదురు. చోర, రోగాగ్ని బాధలు, ప్రజలు ధన మాన ప్రాణ హానులు కలిగి యుందురు. ధాన్యాదుల ధరలు పెరుగును.
3. **సేనాధిపతి శని :** సేనాధిపతి శనియగుటచే రాజులకు యుద్ధమందు సైన్యములు నశించును. ప్రజలు న్యాయపరులు. నల్లని ధాన్యములు, నల్లని భూములు బాగుగా ఫలించును. యుద్ధ తీవ్రతచే సకల దేశవాసులు చలించెదరు. నానా విధముల భయముండును. వ్యాపార ఒడిదుడుకులు రవాణా సౌకర్యములు తగ్గి యుండుటచే ధాన్యాదుల ధరలు పెరిగి యుండును. రాజకీయ ఒడిదుడుకులు కలుగును.
4. **అర్ఘాధిపతి శని :** వర్షములు సామాన్యము. దొంగలు, అగ్ని రోగములు వలన పీడ. ఆహార ధాన్యముల కొరత యేర్పడును. రాజకీయ ఒడిదుడుకులు, ప్రజాక్షోభ యుండును. నల్లని భూములు, నల్లని ధాన్యములు నువ్వులు మినుములు బొగ్గు, సీసం, చర్మములు, ఇనుము, తారు, నల్లమందు, నల్ల అవిసెలు, నల్లవాలకు ధరలు సరసమగును.
5. **మేఘాధిపతి శని :** వర్ష ప్రతిభంధకము, రాజులకు ధనాభావము, చలిబాధలు, ప్రజలకు చలిజ్వరములు, ఆహారధాన్యముల కొరత వ్యాధులు ప్రబలుటయు కలుగును.
6. **పూర్వ సస్యాధిపతి చంద్రుడు :** చంద్రుడు పూర్వ సస్యాధిపతియగుటచే జల ధాన్యములు మాగాణి మెట్టపంటలు బాగుగా ఫలించును. పూర్వాపరా సస్యములు ఫలించును. వృక్షజాతులు చక్కగా ఫలించును. చింతపండు, మామిడి పండ్లు, పనస, నారింజాది ఫలములు, గోధుమలు, మంచి ధాన్యములు, జొన్నలు, సజ్జలు, చెరుకు, ఉప్పు, తమలపాకులు మొదలగువాని ధరలు సరసముగా యుండును.
7. **అపర సస్యాధిపతి (ధాన్యాధిపతి) కుజుడు :** ముల్లుగల ధాన్యములు, కందులు, బొబ్బర్లు, మిర్చి, వేరుశెనగ, ఎర్రని ధాన్యములు, ఎర్రని భూములు ఫలించును. మంచి ధాన్యమునకు చెరుకు, బెల్లం, పంచదార, నెయ్యి, నూనెగింజలు, నూనెలు, వేరుశెనగ, ఆముదము, ధరలు పెరుగును. ఆహారధాన్యములకు ధరలు పెరుగును.
8. **రసాధిపతి గురుడు :** బంగారము, వెండి, నెయ్యి, పట్టు, ప్రత్తి, బెల్లం, పంచదార, చెరకు, వస్త్రములకు, ధరలు తగ్గి ప్రజలకందుబాటులో నుండును. అత్యధిక వర్షములుండును. పాడిపంటల సవృద్ధియగును.
9. **నీరసాధిపతి కుజుడు :** పుష్ప వృక్షములు, ఫలవృక్షములు, ఫల పుష్పాదులతో గూడి యుండును. బంగారం, మనులు, రక్తచందనం, కట్టెలు, వీటికి ధరలు హెచ్చుతగ్గులధికమై తగ్గియుండును. మిర్చి పొగాకు ఇనుము ఉక్కు యంత్ర పరికరములు, రాగి, ఇత్తడి, కంచు మొదలగువాని ధరలు పెరిగి నిలబడును. అపరాధాన్యముల ధరలు హెచ్చును. ధాన్యము, బియ్యము ధరలు కంట్రోలు వల్ల తగ్గియుండును.

## పురోహితాది ఉపనాయక నిర్ణయము

పురోహిత, గణక, పరీక్షకాది ఉపనాయక గ్రహములు శుభులు శుభఫలితములను, పాపులు పాప ఫలితములను ఇచ్చెదరు.

| | | |
|---|---|---|
| పురోహితుడు - కుజుడు | పశ్వాధిపతి - శని | మృగాధిపతి - శుక్రుడు |
| అశ్వాధిపతి - శని | జంగమాధిపతి - కుజుడు | రాష్ట్రాధిపతి - కుజుడు |
| రత్నాధిపతి - శని | గ్రామనాయకుడు - శని | గ్రామపాలకుడు - కుజుడు |
| పరీక్షకుడు - కుజుడు | దేవాధిపతి - కుజుడు | శుభాధిపతి - కుజుడు |
| గజాధిపతి - కుజుడు | సర్పాధిపతి - బుధుడు | సర్వదేశోద్యోగి - శని |
| వృక్షాధిపతి - చంద్రుడు | దైవజ్ఞుడ - శుక్రుడు | వస్త్రాధిపతి - గురుడు |
| గణకుడు - బుధుడు | నరాధిపతి - శని | స్త్రీణామాధిపతి - శని |

**21 మందిలో శుభులు 6 పాపులు 15**

## మకరసంక్రమణ పురుషలక్షణము


పులి వాహనం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ క్రోధినామ సంవత్సర పుష్య బహుళ పాడ్యమి మంగళవారం అనగా 14-01-2025 తేదీ మధ్యాహ్నం గం.2-45లకు పునర్వసు నక్షత్రం, విష్కంభం యోగం, బాలువ కరణం లో రవి మకరరాశి ప్రవేశం.

అస్య పురుషస్య లక్షణం - ఫలం

మంగళ వారం :

మహోదర నామము - చోరుల నాశనము,

బిల్వదళ ఉదక స్నానము - మారేడు దళముతో స్నానము చేయుటచే మహా భీతి కల్గును.

బాలువ కరణము - రక్త వస్త్ర ధారణ, రోగదాయకం.

చందన గంధ లేపనము - విప్రనాశనము

జాజీ పుష్పాధారణ - మంచి శోభను కలిగించును.

ముత్య ధారణము - శుభదాయకము.

రజిత పాత్రయందు భుజించుట - సుభిక్షము

పాయస భక్షణం - పశునాశనం

అరటి పండు - ఫలనాశనము

భిండి ఆయుధము - చతుష్పాద జీవులకు నాశనము

అస్య పురుషస్య లక్షణం - ఫలం

ఎరుపు రంగు ఛత్రము - మహాయుద్ధ దాయకము,

వాహనము పులి - అరణ్యమృగ నాశనము,

క్రోధ ముఖము - జన నాశనకరము,

కూర్చునియుండు అవస్థ - మధ్యమ ధరలు కలుగును,

దక్షిణ దిగ్యానము - దక్షిణ దేశములందు విపత్తు, రాజవిద్వరం,

కృష్ణపక్షం - దేశము క్షేమ ఆరోగ్యములతో యుండుట

బహుళ పాడ్యమి - శుభప్రదము

మంగళవారం - వ్యాధుల వలన, దుర్భిక్షము వలన, దొంగల వలన భయము,

అపరాహ్ణ కాలము - శూద్ర నాశనము

వృషభ లగ్నము - సుఖ దుఃఖాసక్తి

ముహూర్తము - సూర్యోదయాది 12 వది సుభిక్షము.




శ్లో॥ మీనచైత్రోధను: పుష్యో మిధునాషాఢకోపిచ,
కన్యాభాద్రపదో మాసా: శూన్యమాసా:ప్రకీర్తితా:

పరిశీలనకు యోగ్యమైన శుభ ముహూర్తములు యథావిధిగా వ్రాయడమైనది.
మీన చైత్రము, ధనుర్మాసము, పుష్య మాసము శుభకార్యాలవిషయమై నిషిద్ధము.
ప్రాంతీయ ఆచారములలో దేశ వ్యవస్థల యందు కొన్నిచోట్ల ఆచరించుట వలన
వ్రాయుట మాత్రము జరుగుచున్నది. వివాహాది శుభముహూర్తములకు పంచక
రహితము ముఖ్యము గాన శ్రద్ధచేసి దోషరహితములైన ముహూర్తములు ఇవ్వడం
జరిగినది. 2024 మే 1 నుండి జూలై 7 వరకు పున: 2025 మార్చి 18 నుండి 28
వరకు శుక్రమౌఢ్యమి, 2024 మే 5 నుండి జూన్ 1 వరకు గురుమౌఢ్యమి గాన
గ్రహించగలరు. గ్రహ చక్రములలో చూపబడిన గ్రహముల రాశి మార్పులను
గ్రహప్రవేశ సమయములతో, ముహూర్తముల గుణదోషములను సరిచూచుకొని
నీర క్షీరన్యాయముగా పరిశీలించుకుని ఉపయోగించగలరని మనవి.

## చైత్రమాసము 9-4-2024 నుండి 8-5-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| | గు | రశు చం బు | |
| | మంగళ 10.4.2024 | | శ |
| కే | | | |

10-4-24 మీనే (రేవతి 4) వక్రీ బుధ: రా.9.30
13-4-24 మేషే రవి: రా.11.17
23-4-24 మీనే కుజ: ఉ.8.28
24-4-24 మేషే శుక్ర: రా.11.58
25-4-24 మీనే (రేవతి 2) బుధ వక్రత్యాగ: సా.6.24
1-5-24 వృషభే గురు: ప.1.0

ఏప్రిల్ 9 మంగళ. పాడ్యమి రేవతి సంవత్సరాదిత్వేన రాజ దర్శనాదీనామ్ మేషం ర ఉ.7-21.

10 బుధ. విదియ భరణి నూతనవస్త్ర వ్యాపారాదులు మేషం ఉ.7-19.

12 శుక్ర. చవితి రోహిణి నూతన వస్త్ర వ్యాపారాదులు మేషం చో ఉ.7-09.

14 ఆది. షష్ఠి ఆర్ద్ర విద్యారంభ ఆశ్వలాయనోపనయనము వృషభ చోర ఉ.8-29 ఆశ్వలాయనోపనయనము మిధునం ర ఉ.11-1 (1చంద్ర:).

ఏప్రిల్15 సోమ. సప్తమి పునర్వసు అన్నప్రాశన, ఉపనయన, అక్షరాస్వీకార, విద్యారంభ, నూతన వస్త్ర వ్యాపార, గృహారంభాదులు వృషభం ర ఉ.8-25.

18 గురు. దశమి మఘ వివాహం వృశ్చికం ర రా.8-35 వివాహం మకరం ర రా.1-17 (8 చంద్రః).

19 శుక్ర. ఏకాదశి మఘ వివాహం మిథునం ర ఉ.10-58.

20 శని. ద్వాదశి పుబ్బ విద్యారంభ, వృషభం ర ఉ.8-05 విద్యారంభ, నూతన వస్త్ర వ్యాపారములు మిథునం చోర ఉ.10-55 ద్వాదశి ఉత్తర వివాహ, గర్భాధాన, గృహప్రవేశములు వృశ్చికం ర రా.8-27 త్రయోదశి ఉత్తర వివాహము మకరం ర రా.1-09.

21 ఆది. త్రయోదశి ఉత్తర క్రయవిక్రయ నూతన వస్త్ర వ్యాపార వివాహములు మిథునం (అగ్ని) ఉ.10-51 త్రయోదశి హస్త వివాహ, గర్భా ధానములు ధనూ ర రా.11-34.

22 సోమ. చతుర్దశి హస్త వృషభం రాజ ఉ.7-57 చతుర్దశి హస్త నూతన వస్త్ర వ్యాపార ప్రా. మిథునం ర ఉ.10-47 చతుర్దశి చిత్ర నూతన గృహ ప్రవేశములు ధనుస్సు ర రా.11-30.

24 బుధ. పాడ్యమి స్వాతి అన్నప్రాశన, నూతన వ్యాపార ప్రారంభములు వృషభం రాజ ఉ.7-49 (6 చంద్రః) అన్నప్రాశన, నూతన వ్యాపార, గృహారంభ, వివాహములు మిథునం ర ఉ.10-39.

25 గురు. విదియ విశాఖ ఆశ్వలాయనోపనయనం కర్కాటకం ర ఉ.11-33.

26 శుక్ర. తదియ అనూరాధ అన్నప్రాశన, ఉపనయన, అక్షర స్వీకార, నూతన వ్యాపార ప్రా., వివాహ, గృహారంభ, గృహప్రవేశములు మిథునం మతాం ర ఉ.10-31 (6 చంద్రః). తదియ అనురాధ వివాహ, గృహప్రవేశములు వృశికం ర. రా. 8-03 (1 చంద్రః, 6 శుక్రః).

28 ఆది. పంచమి మూల వివాహము వృషభం ర. ఉ.7-33 (8చంద్రః) వివాహ, గర్భాధానములు వృశికం చోర రా.7-55 (6 శుక్రః) వివాహ, గర్భాధానములు ధనస్సు ర. రా.11-06.

29 సోమ. పూ.షా. షష్ఠి విద్యారంభ, నూతన వ్యాపార ప్రా. మిథునం రాజ ఉ.10-19 గర్భాధానము వృశికం ర. రా.7-51.

మే 1 బుధవారం. శుక్ర మౌఢ్యప్రారంభం.

మే 2 గురు. నవమి ధనిష్ఠ నూతన వ్యాపార దస్త్రారంభములు వృషభం ర. ఉ.7-18. నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర. ఉ.11-05.

3 శుక్ర. దశమి శతభిషం డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర. ఉ.10-03.

5 గురు మౌఢ్యారంభం

5 ఆది. ద్వాదశి ఉ.భా. డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృషభం ర. ఉ.7-06. డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం చోర ఉ.9-55. డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర. ఉ.10-54.

6 సోమ. త్రయోదశి రేవతి డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర. ఉ.9-51

## వైశాఖ మాసము 9-5-2024 నుండి 6-6-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| చం గు | ర బు | బు కు రా శ | |
| | శుక్ర 10.5.24 | | |
| | | | |
| కే | | | |

| | |
|---|---|
| 10-5-24 | మేషే బుధః సా.6.43 |
| 14-5-24 | వృషభే అర్కః రా.9.22 |
| 19-5-24 | వృషభే శుక్రః ఉ.8.42 |
| 31-5-24 | వృషభే బుధః ప.12.12 |
| 1-6-24 | మేషే కుజః ప.3.37 |

మే 10 శుక్ర. తదియ రోహిణి డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర. ఉ.9-35.

11 కర్తరీ ప్రా॥

12 ఆది. పంచమి ఆర్ద్ర విద్యారంభము వృషభం ర. ఉ.6-38 విద్యారంభము మిథునం చోర ఉ.9-27 విద్యారంభము కర్కాటకం ర. ఉ.10-26.

13 సోమ. షష్ఠి పునర్వసు విద్యారంభము డోలారోహణ అన్నప్రాశనములు మిథునం ర ఉ.9-23.

17 శుక్ర. దశమి పుబ్బ విద్యారంభము డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర ఉ.9-08. విద్యారంభ డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం రాజ ఉ.10-06 క్రయవిక్రయములు తుల ర సా.5-43.

మే 18 శని. దశమి ఉత్తర డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర ఉ.9-04. డోలా రోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం చోర ఉ.10-02.

20 సోమ. ద్వాదశి చిత్ర విద్యారంభ, డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం రాజ ఉ.8-56. విద్యారంభ, డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.9-54. త్రయోదశి చిత్ర నూతన వ్యాపార ప్రా.తుల ర సా.5-32.

23 గురు. పూర్ణిమ విశాఖ డోలారోహణ అన్నప్రాశనములు మిథునం ర ఉ.8-44.

28 కర్తరీత్యాగము.

29 బుధ. సప్తమి ధనిష్ఠ డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు తుల ర సా.4-56.

30 గురు. సప్తమి శతభిషం డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు మిథునం ర ఉ.8-16 డోలా రోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభ ములు కర్కాటకం రాజ ఉ.9-15.

జూన్ 1 గురుమౌఢ్యత్యాగము.

2 ఆది. ఏకాదశి రేవతి డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.9-03.

## జ్యేష్ఠ మాసము 7-6-2024 నుండి 5-7-2024 వరకు

| | | |
|---|---|---|
| శు బు గు ర | కు | రా శ |
| | శని 8.6.24 | |
| కే | | |

| | |
|---|---|
| 12-6-24 | మిథునే శుక్రః సా.6.30 |
| 15-6-24 | మిథునే రవిః ఉ.7.30 |
| 14-6-24 | మిథునే బుధః రా.11.05 |
| 29-6-24 | కర్కాటకే బుధః ప.12.26 |

జూన్ 7 శుక్ర. పాడ్యమి మృగశిర క్రయవిక్రయ నూతన వ్యాపారారంభ ములు మిథునం చోర ఉ.7-45.

9 ఆది. తదియ పునర్వసు విద్యారంభము డోలారోహణ అన్నప్రాశన ములు మిథునం ర ఉ.7-37.

13 గురు. సప్తమి పుబ్బ డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.8-20.

జూన్ 17 సోమ. ఏకాదశి చిత్ర డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం రాజ ఉ.8-05. ఏకాదశి, స్వాతి డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశికం ర సా.4-39.

20 గురు. చతుర్దశి, అనూరాధ డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం రాజ ఉ.7-53.

23 ఆది. విదియ పూ.షా. డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.7-42.

24 తదియ ఉ.షా. విద్యారంభము డోలారోహణ అన్నప్రాశన క్రయ విక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.7-38.

26 బుధ. పంచమి ధనిష్ఠ డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.7-30 పంచమి శతభిషం విద్యారంభము డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశ్చికం ర సా.4-04

28 శుక్ర. సప్తమి ఉ.భా. క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభ ములు వృశ్చికం మతాం ర సా.3-57.

30 ఆది. నవమి రేవతి విద్యారంభము డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.7-15.

## ఆషాఢ మాసము 6-7-2024 నుండి 4-8-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| గు ర | కు | | రా శ |
| బు శు | ఆది 7.7.24 | | |
| చం | | | |
| కే | | | |

| | |
|---|---|
| 6-7-24 | కర్కాటకే శుక్రః తె.4.31 |
| 12-7-24 | వృషభే కుజః రా.6.58 |
| 16-7-24 | కర్కాటకే రవిః రా.11.09 |
| 19-7-24 | సింహే బుధః రా.8.46 |
| 31-7-24 | సింహే శుక్రః ప.2.33 |

జూలై 7 ఆది. విదియ పుష్యమి విద్యారంభము డోలారోహణ అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం మతాం ర ఉ.6-49. శుక్ర మౌఢ్య త్యాగం.

8 సోమ. తదియ ఆశ్రేష విద్యారంభము కర్కాటకం ర ఉ.6-45.

12 శుక్ర. సప్తమి హస్త విద్యారంభము డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశ్చికం ర ప.3-04.

13 శని. అష్టమి హస్త క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశ్చికం ర ప.3-00.

జూలై 14 ఆది. అష్టమి చిత్ర వివాహము కర్కాటకం ర ఉ.6-22 నవమి స్వాతి డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశ్చికం మతాం ర ప.2-56.

15 సోమ. నవమి స్వాతి విద్యారంభము అన్నప్రాశన క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు కర్కాటకం ర ఉ.6-18. విద్యారంభము క్రయవిక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు వృశ్చికం ర ప.2-52.

17 బుధ. ద్వాదశి అనూరాధ విద్యారంభము డోలారోహణ క్రయ విక్రయ నూతన వ్యాపార దస్త్రారంభములు ధనస్సు చోర సా.5-56.

## శ్రావణ మాసము 5-8-2024 నుండి 3-9-2024 వరకు

| | | |
|---|---|---|
| కు గు | | రా శ |
| ర | మంగళ 6.8.24 | |
| బుచం శు కే | | |

| | |
|---|---|
| 5-8-24 | సింహే (మఘ 3) బుధ వక్రారంభః ఉ.10.25 |
| 26-8-24 | మిథునే కుజః ప.3.25 |
| 17-8-24 | సింహే రవిః ఉ.10.29 |
| 22-8-24 | కర్కాటకే వక్రీ బుధః ఉ.6.39 |
| 24-8-24 | కన్యాయాం శుక్రః రా.1.16 |
| 28-8-24 | కర్కాటకే బుధ వక్రత్యాగః (ఆశ్లేష-4) తె.2.43 |

ఆగష్టు 7 బుధ. చవితి ఉత్తర వివాహ గర్భాధానములు మేషం ర. రా.11-30.

8 గురు. పంచమి హస్త వివాహ గర్భాధానములు మేషం మతాం ర రా.11-26 (6 చంద్రః) పంచమి హస్త వివాహం గృహారంభం మిథునం ర. తె.3-43.

9 శుక్ర. పంచమి హస్త వివాహ, గర్భాధానములు మేషం ర. రా.11-22 (6 చంద్రః) షష్ఠి చిత్ర వివాహము మిథునం ర. తె.3-39.

11 ఆది. సప్తమి స్వాతి వివాహ గర్భాధానములు మేషం చోర రా.11-14 (7 చంద్రః).

15 గురు. ఏకాదశి మూల వివాహము మేషం ర రా.10-58 వివాహము మిథునం ర తె.3-15 (7 చంద్రః).

16 శుక్ర. ద్వాదశి పూ.షా. గర్భాధానం మేషం ర రా.10-53.

17 శని. త్రయోదశి ఉ.షా. డోలరోహణ క్రయవిక్రయ నూతన వ్యాపారాదులు ధనస్సు ర ప.3-50.

18 ఆది. చతుర్దశి శ్రవణం వివాహ, గర్భాధానములు మేషం మతాం ర రా.10-46. పూర్ణిమ శ్రవణం గృహారంభం మిథునం చోర తె.3-02. గృహారంభములు కర్కాటకం ర తె.3-59.

19 సోమ. పూర్ణిమ ధనిష్ఠ క్రయవిక్రయ నూతన వ్యాపారాదులు మకరం ర సా.5-14.

వివాహ గర్భాధానములు మేషం ర రా.10-30
ఆగష్టు 22 గురు. చవితి ఉ.భా.వివాహ గృహారంభ గృహప్రవేశములు మిథునం ర రా.2-47 చవితి
వివాహ గృహారంభ గృహప్రవేశములు కర్కాటకం ర
రేవతి వివాహ గృహారంభ గృహప్రవేశములు
తె.3-43.
23 శుక్ర. పంచమి రేవతి నూతన వ్యాపార క్రయవిక్రయములు
మకరం ర సా.4-58 వివాహ గర్భాధాన మేషం ర రా.10-26
పంచమి అశ్విని వివాహము గృహారంభము మిథునం ర రా.2-43,
24 శని. షష్ఠి అశ్విని డోలారోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార
ములు ధనస్సు ర ప.3-24 వివాహ గర్భాధానములు మేషం చోర
రా.10-22 (స్పర్శ).

## భాద్రపద మాసము 4-9-2024 నుండి 2-10-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| కు / గు | | | రా / శ |
| | గురు 5.9.24 | | |
| | | | |
| ర / బు / కే / శు / చం | | | |

| | |
|---|---|
| 4-9-24 | సింహే బుధః ఉ.11.22 |
| 17-9-24 | కన్యాయాం రవిః ఉ.10.55 |
| 18-9-24 | తులాయాం శుక్రః ప.1.57 |
| 23-9-24 | కన్యాయాం బుధః ఉ.10.11 |

సెప్టెం 7 శని. చవితి చిత్ర డోలరోహణ అన్నప్రాశన క్రయవిక్రయములు
తుల ర ఉ.10-20.
9 సోమ. దశమి పూ.షా. డోలరోహణ అన్నప్రాశన క్రయవిక్రయ
ములు తుల ర ఉ.9-57.
15 ఆది. ద్వాదశి శ్రవణం డోలరోహణ అన్నప్రాశన క్రయవిక్రయ
ములు తుల మతాం ర ఉ.9-49.
16 సోమ. త్రయోదశి ధనిష్ఠ డోలరోహణ అన్నప్రాశన క్రయవిక్రయ
ములు తుల ర ఉ.9-46.

## ఆశ్వయుజ మాసము 3-10-2024 నుండి 1-11-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| కు / గు | | | రా / శ |
| | శుక్ర 4.10.24 | | |
| | | | |
| కే / బు | శు / చం | | |

| | |
|---|---|
| 10-10-24 | తులాయాం బుధః ఉ.11.20 |
| 13-10-24 | వృశ్చికే శుక్రః ఉ.6.00 |
| 17-10-24 | తులాయాం రవిః రా.9.26 |
| 20-10-24 | కర్కాటకే కుజః ప.2.25 |
| 29-10-24 | వృశ్చికే బుధః రా.10.39 |

అక్టోబర్ 4 శుక్ర. విదియ చిత్ర డోలరోహణ క్రయవిక్రయములు మకరం ర ప.2-13 విదియ స్వాతి వివాహ గర్భాధానములు మేషం చోర రా.7-41 (7 చంద్రః, 7 శుక్రః) విదియ స్వాతి వివాహ గర్భాధానములు వృషభం ర రా.9-09 (6 చంద్రః, 6 శుక్రః).

5 శని. తదియ స్వాతి నూతన వ్యాపార క్రయవిక్రయములు తుల ర ఉ.8-30.

7 సోమ. పంచమి అనూరాధ విద్యారంభ డోలారోహణ అన్నప్రాశన, గృహారంభ నూతన వ్యాపార క్రయవిక్రయములు తుల రాజ ఉ.8-22. పంచమి అనూరాధ గర్భాధానములు మేషం ర రా.7-29. (7 శుక్రః, 8 చంద్రః).

9 బుధ. సప్తమి మూల వివాహము మేషం రాజ రా.7-21 (7 శుక్రః) సప్తమి మూల వివాహము వృషభం ర రా.8-49. (6 శుక్రః, 8 చంద్రః).

11 శుక్ర. నవమి ఉ.షా. వివాహ గృహప్రవేశములు వృషభం (అగ్ని) రా.8-41 (6 శుక్రః) నవమి ఉ.షా. వివాహము కర్కాటకం ర. రా.12-29 (7 చంద్రః).

12 శని. దశమి శ్రవణం వివాహ గర్భాధానములు మేషం రాజ రా.7-09. (7 బు, 7 శు) వివాహ గర్భాధానములు వృషభం రాజ రా.8-37 (6 శుక్రః).

13 ఆది. ఏకాదశి ధనిష్ఠ డోలారోహణ అన్నప్రాశన నూతన వ్యాపార క్రయవిక్రయ వివాహ గృహారంభ గృహప్రవేశములు తుల చోర ఉ.7-58 విద్యారంభ డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు మకరం ర ప.1-37 వివాహము మేషం ర రా.7-05 (7 బు)

14 సోమ. ద్వాదశి శతభిషం గర్భాధానములు మేషం ర రా.7-01 గర్భాధాన గృహప్రవేశములు వృషభం రాజ రా.8-29 (7 శుక్రః).

16 బుధ. చతుర్దశి ఉ.భా. డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు మకరం ర ప.1-25 చతుర్దశి ఉ.భా. వివాహము మేషం ర. రా.7-01 (7 బుధః) పూర్ణిమ రేవతి వివాహ గృహప్రవేశములు వృషభం ర రా.8-21 (7 శుక్రః) వివాహము కర్కాటకం చోర రా.12-09.

17 గురు. పూర్ణిమ రేవతి డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు మకరం ర ప.1-21 (7 శు)

20 ఆది. చవితి రోహిణి వివాహ గర్భాధాన గృహప్రవేశములు వృషభం మతాం ర రా.8-05 (1చం, 7శు) వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం ర రా.10-54. (6 శుక్రః).

అక్టోబర్ 21 సోమ. చవితి రోహిణి అన్నప్రాశన నూతన వ్యాపార క్రయవిక్రయ
గృహారంభ గృహప్రవేశములు (7 చం) వృశ్చికం ర ఉ.8-23
(7 చం) పంచమి మృగశిర గర్భాధాన గృహప్రవేశములు వృషభం
ర రా.8-01 (1చం) గర్భాధానములు మిథునం చోర రా.10-51
సప్తమి

23 బుధ. సప్తమి ఆర్ద్ర విద్యారంభము వృశ్చికం ర ఉ.8-15 సప్తమి
పునర్వసు గర్భాధానము వృషభం అగ్ని రా.7-53 గర్భాధానము
మిథునం ర రా.10-43.

24 గురు. అష్టమి పునర్వసు గృహారంభములు వృశ్చికం ఉ.8-11 పూర్ణ.

26 శని. దశమి ఆశ్లేష విద్యారంభము వృశ్చికం ర ఉ.8-04 దశమి
మఖ వివాహము వృషభం అగ్ని రా.7-42 వివాహము మిథునం
ర రా.10-31.(6 శు).

27 ఆది. ఏకాదశి మఖ వివాహము వృశ్చికం ర ఉ.8-00 వివాహము
వృషభం చోర రా.7-38 (7 శుక్ర:) వివాహము మిథునం ర
రా.10-27. (6 శుక్ర:).

## కార్తీక మాసము 2-11-2024 నుండి 1-12-2024 వరకు

| | | | |
|---|---|---|---|
| గు | | | రా శ |
| కు | ఆది 3.11.24 | | |
| | | | |
| కే | | ర | బు చం శు |

6-11-24 ధనుషి శుక్ర: తె.3.31
16-11-24 వృశ్చికే రవి: సా.6.59
26-11-24 వృశ్చికే (జ్యేష్ఠ 4)
బుధ వక్రారంభం ఉ.8.11

నవం. 3 ఆది. విదియ అనూరాధ వివాహ గర్భాధాన గృహప్రవేశములు
వృషభం చోర మతాం ర రా.7-11 (7 శుక్ర: 7 చంద్ర:) తదియ
అనూరాధ వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం చోర
మతాం ర రా.10-00 (6 శుక్ర: 6 చంద్ర:).

6 బుధ. షష్ఠి పూ.షా. గర్భాధానము మిథునం రా.9-49 చోర (పూర్ణ.)

7 గురు. సప్తమి ఉ.షా. వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం
ర రా.9-45 (8 చంద్ర:) (7 శుక్ర:).

8 శుక్ర. సప్తమి ఉ.షా. వైశ్యోపనయన వివాహ గృహారంభ
గృహప్రవేశములు వృశ్చికం మతాం ర ఉ.7-13 అష్టమి శ్రవణం
వివాహము మిథునం ర రా.9-41. (7 శుక్ర:, 8 చంద్ర:).

9 శని. నవమి ధనిష్ఠ వివాహ గృహప్రవేశములు వృషభం ర సా.6-48
(7 బుధ:) వివాహ గర్భాధానములు మిథునం చోర రా.9-37.

నవం. 10 ఆది. నవమి ధనిష్ఠ వైశ్యోపనయన వివాహ గృహారంభములు వృశ్చికం ర ఉ.7-06.

13 బుధ. ద్వాదశి రేవతి వైశ్యోపనయన వివాహ గృహారంభ గృహప్రవేశములు వృశ్చికం చోర ఉ.6-54.

14 గురు. త్రయోదశి అశ్వినివైశ్యోపనయన వివాహ గృహారంభములు వృశ్చికం ర ఉ.6-50. (6 చంద్రః).

17 ఆది. విదియ మృగశిర వివాహ గృహప్రవేశములు మిథునం అగ్ని రా.9-06 (7 శుక్రః) (రిఃఫ చంద్రః).

18 సోమ. తదియ మృగశిర నూతన వ్యాపార క్రయవిక్రయములు మేషం మతాం ర సా.4-44.

20 బుధ. షష్ఠి పుష్యమి గర్భాధానము మిథునం ర రా.8-54.

22 శుక్ర. అష్టమి మఘ వివాహము తుల ర తె.5-22.

23 శని. దశమి ఉత్తర వివాహ గృహారంభములు తుల రాజ తె.5-14

25 సోమ. దశమి ఉత్తర గర్భాధాన గృహప్రవేశములు మిథునం ర రా.8-34.

## మార్గశిర మాసము 2-12-2024 నుండి 30-12-2024 వరకు

| | | |
|---|---|---|
| గు | | రా శ |
| కు | మంగళ 3.12.24 | శు |
| కే | | ర చం బు |

| | |
|---|---|
| 2-12-24 | మకరే శుక్రః ఉ.11.57 |
| 6-12-24 | కర్కాటకే (పుష్యమి 3) |
| | కుజవక్రారంభం తె.5.01 |
| 15-12-24 | వృశ్చికే (అనూరాధ 3) |
| | బుధ వక్రత్యాగం రా.2.26 |
| 16-12-24 | ధనుషీ రవిః ఉ.6.57 |
| 28-12-24 | కుంభే శుక్రః రా.11.40 |

డిసెం. 4 బుధ. చవితి ఉ.షా. వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం ర రా.7-58 (7 చంద్రః)

5 గురు. పంచమి ఉ.షా. డోలారోహణాదులు మేషం ర ప.3-37 పంచమి శ్రవణం వివాహ గృహారంభములు తుల రాజ తె.4-30.

6 శుక్ర. షష్ఠి ధనిష్ఠ వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం అగ్ని రా.7-50 (8 చంద్రః) షష్ఠి ధనిష్ఠ వివాహ గృహారంభ గృహప్రవేశములు తుల ర తె.4-26.

7 శని. సప్తమి ధనిష్ఠ డోలారోహణ క్రయ విక్రయములు మేషం మతాం ర ప.3-29. సప్తమి శతభిషం వివాహ గర్భాధాన గృహప్రవేశములు మిథునం ర రా.7-46 వివాహ గృహారంభ గృహప్రవేశములు తుల ర తె.4-22.

డిసెం.9 సోమ. నవమి ఉ.భా. మేషం అగ్ని ప.3-21. నవమి ఉ.భా. గర్భాధానము మిథునం రాజ రా.7-38.

14 శని. పూర్ణిమ రోహిణి వివాహ గృహప్రవేశములు మిథునం అగ్ని రా.7-19 (రిఃఫచంద్రః) పూర్ణిమ రోహిణి వివాహ గృహారంభములు తుల ర తె.3-54. (8 చంద్రః).

16 సోమ. విదియ ఆర్ద్ర క్రయవిక్రయం వృషభం ర సా.4-21.

18 బుధ. చవితి పుష్యమి క్రయవిక్రయం వృషభం ర సా.4-13.

20 శుక్ర. షష్ఠి మఘ వివాహము తుల ర తె.3-31 వివాహము వృశ్చికం రాజ తె.4-27

22 ఆది. సప్తమి ఉత్తర డోలా క్రయవిక్రయం మేషం ర ప.2-30 అష్టమి ఉత్తర గృహారంభ గృహప్రవేశము వృశ్చికం ర తె.4-19.

25 బుధ. దశమి చిత్ర నూతన వ్యాపార క్రయవిక్రయములు మేషం అగ్ని ప.2-18 దశమి స్వాతి నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం రాజ సా.3-46 ఏకాదశి స్వాతి వివాహ గృహారంభములు వృశ్చికం ర తె.4-08. (12 చంద్రః)

## పుష్య మాసము 31-12-2024 నుండి 29-1-2025 వరకు

| | | | |
|---|---|---|---|
| గు | | | రా శ శు |
| కు | గురు 2.1.2025 | | చం |
| కే | | | ర బు |

| | | |
|---|---|---|
| 4-1-25 | ధనుషి బుధః | ప.12.03 |
| 14-1-25 | మకరే రవిః | ప.2.45 |
| 21-1-25 | మిథునే వక్రీ కుజః | ఉ.10.05 |
| 24-1-25 | మకరే బుధః | సా.5.38 |
| 28-1-25 | మీనే శుక్రః | ఉ.7.02 |

2025జన.1. బుధ . విదియ ఉ.షా. విద్యారంభ డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం మతాం ర ప.3-18

2 గురు. తదియ శ్రవణం విద్యారంభ డోలారోహణ నూతన వ్యాపార క్రయ విక్రయములు మేషం రాజ ప.1-46.

3 శుక్ర. చవితి ధనిష్ఠ డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు మేషం ప.1-43 (స్పర్శ).

4 శని. పంచమి శతభిష విద్యారంభ డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయ ములు వృషభం అగ్ని ప.3-06.

5 ఆది. విద్యారంభం వృషభం ర ప.3-02.

6 సోమ. సప్తమి ఉ.భా. డోలా క్రయవిక్రయం మేషం ర ప.1-31.

జనవరి10 శుక్ర. ద్వాదశి రోహిణి విద్యారంభ డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం మతాం ర ప.2-43.

11 శని. త్రయోదశి మృగశిర డోలారోహణ అన్నప్రాశన నూతన వ్యాపార క్రయ విక్రయములువృషభం ర ప.2-39.

12 ఆది. చతుర్దశి ఆర్ద్ర వృషభం ర ప.2-35.

15 బుధ. విదియ ఆశ్రేష విద్యారంభం మేషం ర ప.12-55 విదియ ఆశ్రేష విద్యారంభం మిథునం ర సా.5-12.

17 శుక్ర. చవితి పుబ్బ వృషభం ర ప.2-15 పూర్ణ

18 శని. పంచమి పుబ్బ విద్యారంభము మేషం మతాం ర ప.12-43 పంచమి పుబ్బ విద్యారంభము వృషభం ర ప.2-11 పంచమి ఉత్తర క్రయవిక్రయములు మిథునం ర సా.5-01.

19 ఆది. షష్ఠి ఉత్తర డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం ర ప.2-07.

20 సోమ. సప్తమి హస్త మిథునం ర సా.4-53 (పూర్ణ)

22 బుధ. నవమి స్వాతి డోలారోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం ర ప.1-55, నవమి స్వాతి నూతన వ్యాపార క్రయవిక్రయములు మిథునం రాజ సా.4-45

24 శుక్ర. దశమి అనూరాధ నూతన వ్యాపార క్రయవిక్రయములు మిథునం ర సా.4-37.

## మాఘ మాసము 30-1-2025 నుండి 28-2-2025 వరకు

| | | |
|---|---|---|
| గు కు | | రా శు శ చం |
| | శుక్ర 31.1.25 | ర బు |
| కే | | |

11-2-25 కుంభే బుధః ప.12.53
12-2-25 కుంభే రవిః రా.1.36
24-2-25 మిథునే (పునర్వసు-1) కుజ వక్రత్యాగః ఉ.7.26
27-2-25 మీనే బుధః రా.11.45

జనవరి31 శుక్ర. విదియ శతభిషం ఉపనయన గృహారంభ వివాహములు మేషం చోర ప.11-52 తదియ శతభిషం వివాహము తుల ర రా.12-45.

ఫిబ్ర. 1 శని. తదియ పూ.భా. ఆశ్వలాయనోపనయన నూతన వ్యాపార క్రయవిక్రయములు మేషం ర ప.11-48.

2 ఆది. చవితి ఉ.భా. డోలరోహణ వివాహ నూతన వ్యాపార క్రయ విక్రయములు మేషం ర ప.11-44 పంచమి ఉ.భా. డోలరోహణ నూతన వ్యాపార క్రయవిక్రయములు వృషభం ర ప.1-12 పంచమి ఉ.భా. వివాహము తుల రాజ రా.12-37. (6 చంద్ర, 6 శుక్రః)

Scanned with CamScanner

ఫి|బ.3 సోమ. షష్ఠి రేవతి ఉపనయన వివాహములు మేషం ర ప.11-40 (12 చంద్రః)

7 శుక్ర. ఏకాదశి రోహిణి అన్నప్రాశన ఉపనయన వివాహ సూత్ర గృహారంభములు మేషం రాజ ప.11-24, ఏకాదశి మృగశిర వివాహము తుల ర రా.12-17. (8 చం, 6 శు).

8 శని. ఏకాదశి మృగశిర అక్షరాభ్యాస ఉపనయన వివాహములు మేషం చోర ప.11-20 ఏకాదశి మృగశిర డోలా క్రయవిక్రయములు వృషభం ర ప.12-48.

9 ఆది. ద్వాదశి ఆర్ద్ర ఆశ్వలాయన ఉపనయన విద్యారంభములు మేషం మతాం ర ప.11-16 ద్వాదశి ఆర్ద్ర విద్యారంభము వృషభం ర ప.12-44.

10 సోమ. త్రయోదశి పునర్వసు అన్నప్రాశన గృహారంభ డోలారోహణ ములు మేషం ర ప.11-12.

13 గురు. పాడ్యమి మఘ వివాహం వృషభం (అభిజిల్లగ్నం) ర ప.12-28 విదియ పుబ్బ గర్భాధానము తుల ర రా.11-54

14 శుక్ర. విదియ పుబ్బ కర్కాటకం ర సా.4-12.

15 శని. తదియ ఉత్తర అన్నప్రాశన నూతన వ్యాపారారంభ ఉపనయన అక్షరాస్వీకార వివాహ గృహారంభములు మేషం ర ప.10-53 (6 చం) వృషభం (అభిజిల్లగ్నం) చోర ప.12-21 చవితి ఉత్తర వివాహము తుల ర రా.11-46. రిఃఫచంద్రః.

16 ఆది. చవితి హస్త వివాహము తుల ర రా.11-42 పంచమి చిత్ర గృహారంభము మకరం రాజ తె.5-21.

17 సోమ. పంచమి చిత్ర గృహారంభము మేషం రాజ ఉ.10-45.

20 గురు. అష్టమి అనూరాధ క్రయవిక్రయ నూతన వ్యాపారాదులు వివాహము వృషభం ర ప.12-01 (అభిజిల్లగ్నము) (7 చం) అష్టమి అనూరాధ వివాహ గృహారంభములు మకరం ర తె.5-05.

21 శుక్ర. నవమి అనూరాధ వివాహము మేషం మతాం ర ఉ.10-30 (8 చంద్రుడు) నవమి జ్యేష్ఠ నూతన వ్యాపారములు కర్కాటకం సా.3-45.

22 శని. దశమి మూల వివాహము మకరం రాజ తె.4-58 (12 చం)

23 ఆది. దశమి మూల వివాహము మేషం రాజ ఉ.10-22 వివాహము ఏకాదశి మూల వృషభం మతాం ర ప.11-50. (8 చంద్రః)

## ఫాల్గుణ మాసము 1-3-2025 నుండి 29-3-2025 వరకు

| | | |
|---|---|---|
| గు శు | | బు రా చం ర శు శ |
| | ఆది 2.3.25 | |
| కే | | |

1-3-25 మీనే (ఉ.భా.4) శుక్రః వక్రారంభం తె.6.04
14-3-25 మీనే రవిః రా.9.11
15-3-25 మీనే (ఉ.భా.4) బుధ వక్రారంభం ప.12.15
29-3-25 మీనే శనిః రా.9.46

మార్చి 1 శని. విదియ పూ.భా. నూతనవ్యాపారాదులు వృషభం ర ఉ.11-23 విదియ ఉ.భా. క్రయ విక్రయ నూతన వ్యాపారాదులు కర్కాటకం ర ప.3-11 తదియ ఉ.భా. వివాహ గృహారంభము మకరం రాజ తె.4-27.

2 ఆది. తదియ ఉ.భా. ఉపనయన గృహారంభ వివాహములు మేషం మతాం ర ఉ.9-51 (రిఃఫచంద్రః) తదియ ఉ.భా. వివాహ గృహారంభ గృహప్రవేశములు వృషభం ర ఉ.11-19 చవితి రేవతి గృహారంభములు మకరం ర తె.4-23.

3 సోమ. చవితి రేవతి వివాహ గృహారంభములు మేషం ర ఉ.9-47 అశ్విని గృహారంభము వృషభం ర ఉ.11-15 పంచమి అశ్విని గర్భాధానము తుల చోర రా.10-40.

7 శుక్ర. నవమి మృగశిర డోలారోహణ నూతన వ్యాపారాదులు కర్కాటకం మతాం ర ప.2-48 నవమి మృగశిర వివాహ గర్భాధానములు తుల ర రా.10-25. (6 శుక్రః)

9 ఆది. ఏకాదశి పునర్వసు ఉపనయన గృహారంభములు వృషభం ర ఉ.10-52.

10 సోమ. ఏకాదశి పుష్యమి ఉపనయనం అన్నప్రాశనం మేషం రాజ ఉ.9-20

12 బుధ. చతుర్దశి మఘ వివాహం వృషభం ర ఉ.10-41 వివాహము మకరం ర తె.3-45. (8 చంద్రః)

13 గురు. చతుర్దశి పుబ్బ నూతన క్రయ విక్రయ వ్యాపారములు మేషం రాజ మతాం ర ఉ.9-09.

14 శుక్ర. పాడ్యమి ఉత్తర వివాహ గృహారంభములు మకరం ర తె.3-37.

మార్చి15 శని. పాడ్యమి హస్త వివాహము మేషం రాజ ఉ.9-01 (6
వివాహ గృహారంభ గృహప్రవేశములు వృషభం ర ఉ.10-29.
16 ఆది. విదియ చిత్ర కర్కాటకం ర ప.2-13 తదియ
వివాహము తుల ర రా.9-50 (రిఃఫచంద్రః).
17 సోమ. తదియ చిత్ర ఉపనయనము గృహారంభము మేషం
ర ఉ.8-53 ఉపనయన గృహారంభ గృహప్రవేశములు వృషభం
ర ఉ.10-21 (6 చంద్రః).
18 పశ్చాదస్తమిత శుక్ర మౌఢ్యారంభము
19 బుధ. పంచమి విశాఖ విద్యారంభం వృషభం ర ఉ.10-13.
21 శుక్ర. సప్తమి జ్యేష్ఠ నూతన వ్యాపార దస్త్రప్రారంభములు వృషభం
ఉ.10-05 (స్పర్శ) నూతన వ్యాపార దస్త్రప్రారంభములు కర్కాటకం
ప.1-53.
22 శని. అష్టమి మూల డోలరోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార
దస్త్రప్రారంభ ములు వృషభం ర ఉ.10-01.
23 ఆది. నవమి పూ.షా. డోలరోహణ క్రయవిక్రయ నూతన వ్యాపార
దస్త్రప్రారంభ ములు కర్కాటకం ర ప.1-45.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
లక్ష్మీ వేంకటేశ్వరార్పణమస్తు

## కోనసీమ ప్రభలతీర్థం ది.16-01-2025 గురువారం

**(సుమారు 421 సంవత్సరాలనుండి దివ్య ప్రభల శోభ)**

"నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః"- కృష్ణ యజుర్వేద సంహిత
కనుమ రోజున ఏకాదశ రుద్రులు అనగా 1.విశ్వేశ్వరుడు (వ్యాఘ్రేశ్వరం) 2.మహాదేవుడు (కె.పెదపూడి) 3.త్ర్యంబకేశ్వరుడు (ఇరుసుమండ) 4.త్రిపురాంతకుడు (వక్కలంక) 5.త్రికాగ్నికాలుడు (నేదునూరు) 6.కాలాగ్నిరుద్రుడు (ముక్కామల). 7.నీలకంఠుడు (మొసలపల్లి) 8.మృత్యుంజయుడు (పాలగుమ్మి) 9.సర్వేశ్వరుడు (గంగలకుర్రు అగ్రహారం) 10.సదాశివుడు (గంగలకుర్రు) 11.మహాదేవుడు (పుల్లేటికుర్రు) మరియు ఇతర ధార్మిక ప్రాంతాల నుంచి వచ్చి, ఏకాదశరుద్రుల రూపంలో, దివ్యప్రభలలో కొలువుతీరే అద్వితీయమైన ఘట్టం. పరమేశ్వరుని దర్శనం కోసం ప్రజలంతా బారులు తీరి భక్తిభావంతో పరమానందంతో పులకరించి తరించే ఆధ్యాత్మిక క్షేత్రం తూర్పుగోదావరిజిల్లా కోనసీమలో జగ్గన్నతోట.




| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 8 | వ్యయం | - 14 |
| రాజపూజ్యం | - 4 | అవమానం | - 3 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు ద్వితీయ స్థానమందు గురుడు తామ్రమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా లాభస్థానమందు లోహ మూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరమంతా వ్యయ, షష్ఠ స్థానములందు రజితమూర్తులుగానూ సంచరింతురు. గోచారరీత్యా ద్వితీయస్థానమందున్న గురుడు శుభయోగకారకుడు. కుటుంబ వృద్ధి, స్త్రీలకు సౌభాగ్యకరమగు వాతావరణము, పుణ్యకార్యములకు ధనము వెచ్చించుట, మనస్సౌఖ్యము కల్గును. ఈ రాశి వారికి ఆశావాద దృక్పథం పెంచుకోవడం, వ్యక్తిగత విలువలను పునరుద్ధరించుకోవడం, గతములో పోగొట్టుకున్న నష్టపోయిన ధనాన్ని తిరిగి సముపార్జన చేయగలగడం సంతానం విషయాలలో ముందంజ వేయడం మొదలగు శుభ పరిణామములు సంభవిస్తాయి. సంపద పెరుగుతుంది. ఉద్యోగస్తులకు శ్రమ అయిననూ వేతనం పెంపు మనోవికాశం కల్గుతుంది.

ఏకాదశ స్థానంలో శని ఉండుట వలన మిక్కిలి అనుకూలమైన సమయం. దీర్ఘకాలంగా న్యాయపరమైన సమస్యలకు అనుకూల పరిష్కారం వస్తుంది. భార్యా పుత్రుల వలన సుఖము, సంతానం విషయంలో ముందంజ వేయుట, శరీర ఆరోగ్యము మనోనిర్మలత ఇష్టకార్యసిద్ధి కలుగును. విదేశీవిద్యను ఆశించువారు ఆలస్యమైననూ సహనంగా యుండి, తగిన సమయము కొరకు వేచి చూడవలసి వస్తుంది. అయితే ఉన్నత విద్యాయోగమైతే కల్గుతుంది. పుత్ర సంప్రాప్తత కళత్ర సౌఖ్యము, ధన లాభము, ఇష్టార్థ సిద్ధి, అధికార వృద్ధి, కుటుంబ సౌఖ్యము అనేక విధాలైన శుభపరిణామములు కలుగును. ఏకాదశ స్థానమందు శని సంచారము ప్రత్యేకించి రాజకీయనాయకులకు సామాజిక వ్యవహారాలలో చెప్పుకోదగిన విధంగా మునుపు ఎన్నడూ లేని విధంగా ప్రభావితం చేస్తుంది. కొత్త రాజకీయపార్టీలతో పొత్తులు కట్టుట వలన మరింత ధృడంగా ముందుకు సాగుతారు. ప్రత్యర్థులపై గెలిచే అవకాశములు మెండుగా ఉంటాయి. స్వయం వృత్తులవారి ఎదుగుదలకు అనుకూల సమయం. ఉద్యోగస్తులకు ఉద్యోగ విషయాల్లో ముందంజ వేస్తారు. భాగస్వామ్య వ్యాపారాలు అనుకూల మవుతాయి. వ్యాపారం విషయంలో కొత్త అవకాశాలు వస్తాయి. తరచూ దూర ప్రాంతాలు తిరిగి రావలసి వస్తుంది. కుటుంబ సభ్యుల ఖర్చులు అదుపులో ఉంచుట మంచిది. వ్యయ స్థానమందు కేతువు షష్ఠ స్థానమందు మూర్తివంతముచే మంచి ఫలితములనిచ్చును. ఇతర దేశములకు తరచూ ప్రయాణములు కలసి వచ్చిననూ ఆర్థిక విషయమై ముందంజ లేక వెనుకబాటును కలుగజేయును. పోటీ పరీక్షలలో ఉత్తీర్ణత, ఉద్యోగ సిద్ధి కలుగుతుంది. అశ్విని నక్షత్రం వారికి హఠాత్తుగా ఆనందకరమగు సంఘటనలు, కుటుంబంలో శుభయోగములు, కార్య సిద్ధి ధనయోగములను కలుగుతుంది. భరణి నక్షత్రం

వారికి అవసరానికి తగిన ధనము వస్తుంది విద్యార్థులకు అఖండ విద్యాయోగం. కృత్తిక 1వ పాదము వారికి ప్రభుత్వ అధికారుల అనుకూలత, శుభయోగములు కల్గును. ఆగస్టు నుండి అక్టోబర్ నెల మధ్య ఆర్థిక ఇబ్బందులు కలుగును.

వీరికి '9' అదృష్ట సంఖ్య. 10,11,14,15,19,20,30 తేదీలు అనుకూలం. గురు,శుక్ర శనివారములు అనుకూలము.

**ఏప్రిల్:** వాక్చాతుర్యంతో సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. ఆర్థిక స్థితిగతులు సామాన్యము. ఉద్యోగస్తులకు ఉన్నతాధికారులతో సత్సంబంధాలుంటాయి, సైన్సు ఇంజనీరింగు రంగాలలో విద్యార్థులు రాణిస్తారు.

**మే:** సమాజంలో ఉన్నత స్థాయి వ్యక్తుల వలన సన్మానం, విద్యార్థులు శ్రమించి విద్యా విషయాల్లో రాణించడం, వృత్తి వ్యాపారాలలో సామాన్య ఆదాయం పర్వత శీతల ప్రాంతాలలో సంచరించుట, వాహన సౌఖ్యం కలిగియుందురు.

**జూన్:** హఠాత్తుగా సంభవించే పరిణామాలను ఎదుర్కొనడానికి సిద్ధం అవుతారు. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లతో సంబంధాలు అంతంతమాత్రం. మనశ్శాంతి తక్కువవుతుంది. అవసరాలకు సరిపడ ధనమును ఏర్పరుచుకో గల్గుతారు.

**జూలై:** బంధు మిత్రులతో సత్సంబంధాలు, మోకాళ్ళకు, పాదాలకు సంబంధించి చికిత్సలు చేయించుకోవాల్సి వస్తుంది. విద్యా విషయమై ప్రభుత్వ సహాయం లభిస్తుంది. విద్యా సముపార్జన చేసి, ముందంజ వేస్తారు.

**ఆగస్టు:** సంపాదన పెరుగుతుంది. ఆధ్యాత్మిక శోభ వెల్లి విరుస్తుంది. స్త్రీమూలక ధనం లభిస్తుంది. శుభకార్య నిర్వహణ జరుగుతుంది. గత అనుభవాలను దృష్టిలో పున: పరిశీలించుకుని ముందు ముందు మంచి దిశలో అడుగులు వేస్తారు.

**సెప్టెంబర్:** సోమరితనము వీడి కార్యోద్యుక్తులవ్వాలి. శరీర ఆరోగ్యం బాగుంటుంది గృహమున ఆనందోత్సవాలు, తలపెట్టిన పనులు సత్వరమే పూర్తి చేస్తారు సమాజంలో కీర్తి, గౌరవమర్యాదలు పెరుగుతాయి.

**అక్టోబర్:** మనోనిర్మలత, భార్యా సంతానం వలన శుభాశయములు నెరవేరుట, స్థిరాస్తుల వృద్ధి అనేక విధాలుగా ఆదాయం పెరగడం, సర్వకార్యముల యందు అనుకూలత, శరీర సౌఖ్యము, గృహవాతావరణం అనుకూలం.

**నవంబర్:** శరీర రుగ్మతలు తొలగి ఆనందం పొందే సమయం. భూమి లేదా గృహము వంటి స్థిరాస్తిని కొనుగోలు చేసే అవకాశం గృహమున మగ సంతానానికి అదృష్టం తెచ్చిపెట్టే అందమైన అమ్మాయితో వివాహం అవుతుంది. బంగారు ఆభరణములు కొనుగోలు, విద్యార్థులు స్వతసిద్ధమైన ప్రతిభతో రాణిస్తారు.

**డిసెంబర్:** శారీరిక మానసిక వ్యథ కల్గుతుంది.ఫైనాన్సు రంగ సంస్థల నుండి తీసుకున్న ఋణములు భారమయ్యే అవకాశ ఉంది. ఆర్థిక పరిస్థితులకు తట్టుకోలేక ఇతరత్రా అప్పులు చేస్తే ఇబ్బందులు పెరుగుతాయి.

**2025 జనవరి:** వృత్తి వ్యాపారాలలో అనుకూలం. మీ సామాజిక పరిధి గొప్ప ప్రదంగా విస్తరింపబడుతుంది. దూరప్రయాణాలు, ఖర్చులు తప్పవు. బంధువులు ఇంటికి పరామర్శకు వెళ్లాల్సి వస్తుంది. భూ వివాదాలు పరిష్కరించుకోవలసి వస్తుంది

**ఫిబ్రవరి:** వృత్తి వ్యాపారాలలో ధైర్యం, ఆత్మస్థైర్యం ప్రదర్శించి లాభాలను పొందుతారు. కొత్త వ్యాపారాలకు శ్రీకారం చుడతారు. ఉద్యోగ విషయాలు ఆశాజనకంగా ఉంటాయి. వస్తువులు వాహనములు చోరీకి గురికాకుండా శ్రద్ధ అవసరం. వైవాహిక జీవనం ఆనందమయంగా ఉంటుంది.

**మార్చి:** ఈ రాశి వారికి శుక్రుడు మిశ్రమ ఫలితాలనిస్తాడు. నూతన పెట్టుబడుల వ్యాపారాలకు అవకాశం ఉంది. అపాయము నుండి బయటపడుట, బంధువర్గము వారికి దుఃఖము, సమస్యలను పరిష్కరించుటకు రాజీపడుట మంచిది.






| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | 2 | వ్యయం | - | 8 |
| రాజపూజ్యం | - | 7 | అవమానం | - | 3 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు జన్మ రాశి యందు గురుడు రజితమూర్తిగాను, శనైశ్చరుడు సంవత్సరమంతా రాజ్యస్థానమందు తామ్రమూర్తిగాను, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు ఏకాదశ, పంచమ స్థానములందు సువర్ణమూర్తులుగాను సంచరింతురు. రాహువు లాభస్థానమందు యుండుటచే అన్ని రంగాలలోను విజయాన్ని కలుగ జేస్తాడు. ఆర్థికలాభాలు, ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. దశమ శని ఆత్మ స్థైర్యాన్నిస్తాడు. నూతన వ్యాపారాలను చేస్తారు. కృషికి తగిన ఫలితమిస్తుంది.

వృషభరాశిలోనికి గురుసంచారం వీరికి ఆశావాద దృక్పథంతో బాటు నూతన జీవితాన్ని ప్రసాదిస్తుంది. వ్యవసాయ రంగం వారికి అత్యున్నత ఫలితా లుంటాయి. కొత్తరకం పంటలను పండించి ఆదాయం పొందుతారు. అనుకున్న ఆశయాన్ని సాధించటానికి ప్రయత్నిస్తే పట్టినది బంగారమవుతుంది. మీకు వ్యక్తిగత ఎదుగుదలతో బాటు కొత్త అవకాశాలు లభిస్తాయి. అయితే సంవత్సర ప్రారంభంలో వ్యయరాశి గతుడైన గురుడు శుభ మూలక ధనవ్యయాన్ని కలుగజేస్తే, తదుపరి జన్మరాశి యందు గురుని సంచారము వలన స్థాన చలనము, స్థాన భ్రంశము, ఉదర సంబంధ అనారోగ్య సమస్యలు, తలనరములు కండరముల నొప్పులను అధిగ మించుటకు గురువారము శెనగలు దానము చేయవలెను. వ్యవసాయ దారులకు కృషి కలసివస్తుంది. రైసు మిల్లర్లకు గతం కంటే ఆశించిన ప్రయోజనములు కల్గుతాయి. పాలకుల బెడద తగ్గుతుంది. అయితే మిశ్రమ ఫలితాలను చవిచూడవలసి వస్తుంది. చేనేత పనివారలకు ఫలితాలు అంతంత మాత్రంగానే ఉంటాయి. సినీ, గాయక, నాటకరంగ కళాకారులకు సామాన్యము. యాంత్రిక రంగం వారికి అనుకూలం. దశమస్థానమందు శని సంచారము కొంత మేరకు ఆశించిన ఫలితాలనివ్వదు. దోషప్రదము, పాప కార్యాచరణ, వృత్తి నష్టము, కర్మ భ్రష్టత, పరితాపము, దుఃఖము, మానభంగము, విఘ్నములు, వ్యాకులత, ఆదాయ నష్టం, కీర్తి భంగము, ఉద్యోగమందు బాధలు వంటి కష్టనష్టములు కలుగును. ఏకాదశ స్థానమందలి రాహువు మరియు తృతీయ స్థానమందలి కేతువు మీ ఆదాయ వనరులపై ప్రత్యక్ష ప్రభావాన్ని చూపుతుంది. దీర్ఘాయుర్దాయంతో శక్తివంతంగా అన్నిరంగాలలోను రాణించేటట్టు చేస్తుంది. జీవితంలో సంపద మరియు శ్రేయస్సును ఇనుమడింపజేస్తాయి. అప్పుడప్పుడు మనోవిచారము సోదరహాని, మర్యాదహాని, సోదరుని గురించి చింత కల్గుతాయి. రైస్ మిల్లర్లకు, హోటల్ నిర్వాహకులకు, గృహ నిర్మాణాలు చేయువార్లకు భాగస్వామ్య సంబంధ వ్యాపారాలు కలసి వస్తాయి. కృత్తిక నక్షత్రం వారికి శుభకార్యాలు కలసివస్తాయి. రోహిణి నక్షత్రం వారికి నవంబర్

నెలలో ఇతరులలతో దుష్ప్రవర్తన కారణంగా ఇబ్బందులు, మృగశిర నక్షత్రం వారికి అక్టోబర్ నెలలో సరియైన నిర్ణయములు చేయకపోవడం వలన ఆర్థిక పరమైన ఒడిదుకులు ఎదురవుతాయి. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య - '6'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్:** సంవత్సరారంభం నుండి మంచి ఫలితములు కల్గును. ధనలాభము కీర్తి పుష్కలమగు శరీర ఆరోగ్యము, కాంతియూ, ద్రవ్యలాభము వృత్తి, వ్యాపారములందు ధనలాభములు కల్గును. స్టాక్ మార్కెట్ పెట్టుబడులు కలసివస్తాయి.

**మే:** ఆర్థికపరమైన స్వావలంబన కల్గుతుంది. అనేక మార్గాలనుండి ఆదాయం వస్తుంది. పెట్టుబడులు, వ్యాపారాలు, వృత్తి విషయాలలో ఆర్థికంగా ముందంజ. ఆరోగ్యం, అన్నింటా జయం కుటుంబ సభ్యులతో అవగాహన కల్గి యుంటారు.

**జూన్:** రక్తపోటు, ఆరోగ్య సమస్యలు, కాలాతిక్రమణ, తలచిన పనులు ఆలస్యం, కార్యవిలంబనం ఆదాయానికి మించిన ఖర్చు, నోటిపూత నాలిక, టాన్సిల్సు సంబంధ అస్వస్థత, నెలాఖరుకు ఆర్థిక,కుటుంబ విషయాల్లో ముందంజ వేస్తారు.

**జూలై:** స్వతంత్ర స్వభావం కలిగి వాగ్దాటి ముక్కుసూటితనంతో ఇతరులపై విరుచుకు పడతారు. కాంతి సంబంధ చికిత్సలు చేయించుకోవాల్సి వస్తుంది. తండ్రితో సత్సంబంధాలుంటాయి. ప్రయాణాలు కలసివస్తాయి.

**ఆగష్టు:** సమాజంలో పేరుప్రఖ్యాతులు మంచి ఆరోగ్యము, ధనాగమము, ధైర్యంతో కార్యభారాన్ని నిర్వర్తించడం ఉద్యోగంలో ప్రమోషన్ అవకాశం వస్తుంది. విద్యార్థులకు ఉన్నత విద్యలు కలసివస్తాయి. నూతన గృహం, వాహనం కొనుగోలు చేస్తారు.

**సెప్టెంబర్:** మీ మాటలు ఇతరులకు ఇబ్బందులు కలిగిస్తాయి. పలుకుబడి గౌరవం, ధనాదాయం పెరుగుతుంది. విద్యార్థులు కొత్త కోర్సులలో బాగా రాణిస్తారు. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు.

**అక్టోబర్:** పనివత్తిడి వలన కుటుంబములో సరియైన సమయం గడపక పోవడం వలన అవగాహనలోపం. విందు వినోదాలకు, జూదం, స్పెక్యులేషన్ వంటి విషయాల్లో దూరంగా ఉండటం మంచిది. సంఘంలో గౌరవం, ఉద్యోగ విషయాలు అనుకూలం.

**నవంబర్:** పై అధికారుల నియంత్రణ, ఉద్యోగస్తులకు పనివత్తిడి వలన తోటి ఉద్యోగులతో అభిప్రాయ భేదములు, క్రమ శిక్షణారాహిత్యంగా కాలక్షేపం చేయడం, ఇతరులను లెక్కచేయకపోవడం ఇటువంటి ఇబ్బందు లుంటాయి.

**డిసెంబర్:** అన్నదమ్ముల సహకారం ఉంటుంది. సుఖ సంతోషాలకు లోటుండదు. ఆస్తుల విలువలు పెరగడం, రత్నములు మణులు మొదలగు వస్తువులను అమ్మివేయడం వలన ఆదాయం కల్గుతుంది.

**2025 జనవరి:** ఆర్థిక పరంగా ఇబ్బందులు ఉండబోవు. విదేశీ వీసాలు, ఇతర దేశప్రయాణాలు కలసివస్తాయి. ధైర్యంతో కార్య సిద్ధి కల్గుతుంది. విద్యా వికాసం కల్గుతుంది. రక్తపోటు నియంత్రణ విషయంలో శ్రద్ధ అవసరం. ధనం నిల్వ చేస్తారు.

**ఫిబ్రవరి:** ఉద్యోగ అవకాశాలు మెండు అవుతాయి. రాజకీయాలలో రాణిస్తారు. పోటీ పరీక్షలలో రాణించి రెవెన్యూ అధికారిగా, లేదా పోలీసుశాఖ లో ఉన్నత ప్రభుత్వ అధికారాన్ని పొందే అవకాశం ఉంది.

**మార్చి:** అప్పుల నుండి విముక్తి,ఆర్థికంగా స్థిరత్వం మీరు అనుకున్నది అనుకున్నట్లు సాధిస్తారు. మీ ఇమేజ్ పెరుగుతుంది. భూమి కొనుగోలు చేసే ప్రయత్నానికి శ్రీకారం చుడతారు. ఇల్లు కొనడానికి అవకాశాలు మెరుగవుతాయి.



# మిధునరాశిఫలితములు

మృగశిర:3,4పాదములు
ఆరుద్ర:1,2,3,4పా పునర్వసు:1,2,3పా

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 5 | వ్యయం | - 5 |
| రాజపూజ్యం | - 3 | అవమానం | - 6 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు వ్యయస్థానమందు గురుడు లోహమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా భాగ్యస్థానమందు సువర్ణమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు దశమ, చతుర్థ స్థానములందు తామ్రమూర్తులుగానూ సంచరింతురు.

శుభకార్యములకు ధన వ్యయం చేస్తారు. ఇతరుల వలన తిట్లు తినాల్సి వస్తుంది. జ్ఞానసముపార్జన చేస్తారు. శాంతిని పొందాలని కోరుకుంటారు. ఆధ్యాత్మికత మరియు ఏకాంతంలో ప్రశాంతతను కోరుకుంటారు, సంఘంలో గౌరవాన్ని పొందుతారు. విదేశీ భూములను సంపాదించడం, విదేశాలలో స్థిరపడాలని తహతహ లాడతారు. గృహమున శుభకార్య పరంపర మొదలవుతుంది. సంవత్సరమంతా ఆదాయానికి మించిన ఖర్చులను చేయవలసి వస్తుంది. ఉద్యోగస్తులు స్థానచలనములు ఆశించకుండా ఉన్నచోటే కొనసాగుట మంచిది. వ్యాపారస్తులకు వారి వ్యాపారాలలో చికాకులు, అధికారుల వత్తిడులు. ఈ సమయాలలో అధిక ఖర్చు చేస్తారు. ఇంట శుభకార్య నిర్వహణ చేస్తారు.

మిధునరాశి వారికి గురుడు అక్టోబర్, నవంబర్, డిసెంబర్ నెలల్లో వక్రించి వ్యయరాశిలో సంచార సమయంలో శాస్త్ర, సాంకేతిక పరిశోధకులు జ్ఞానాన్ని విస్తరించుకొని, విస్తృతమైన విషయాలను అన్వేషించి, పరిశోధనలలో రాణించి నూతన ఆవిష్కరణలు చేసి, వ్యక్తిగతంగా వృద్ధి చెందుతారు. వ్యాపారస్తులు అనేక కొత్త మార్గాలలో వ్యాపార విస్తరణ చేయుట జరుగుతుంది. కిరాణా ఫ్యాన్సీ వ్యాపారస్తులకు అధిక లాభాలు, విద్యార్థులకు ఉన్నత చదువులకు అవకాశం, రాజకీయనాయకులకు నిరాశ, ఫైనాన్సు సంస్థల యజమానులకు సామాన్య ఫలితాలు కల్గుతాయి. శని భాగ్యస్థానమందు జీవన గమనంలో ఆకస్మిక సంఘటనలు, అదృష్టం పై ప్రభావం చూపుతుంది. ఈ రాశివారు నిరాశను అధిగమించిన, సకల కార్యములలోనూ వీర్య జయము కల్గుతుంది. పితృవర్గమువారి నుండి చెడు అనుభవములు ఎదురవుతాయి. శ్రీ వేంకటేశ్వరుని ఆరాధన, మందపల్లి శనైశ్చరుని క్షేత్రములో తైలాభిషేకములు చేయుట వలన కొంతవరకు ఇబ్బందుల నుండి బయట పడగల్గుతారు. అయితే శనైశ్చరునికి భాగ్య స్థానమందు సువర్ణమూర్తి వంతముచే ప్రతికూల ఫలితములు తగ్గి అన్ని విధములా యోగించును. భూములను కొనుగోలు, క్రమేపీ అన్ని విషయాలలోనూ ముందంజ, ఆర్థిక పరిపుష్టి కల్గుతుంది. మృగశిర వారు కష్టించి పనిచేసి పేరు ప్రఖ్యాతులు గడిస్తారు. ధనాన్ని ఆర్జిస్తారు. ఆర్ద్ర వారికి స్నేహితులతో బంధువులతో ప్రతికూల పరిస్థితులు, చదువు ఉన్నత విద్యలలో ఆసక్తి చూపించి అనుకూల పరిస్థితులు ఏర్పరచుకుంటారు. పునర్వసు నక్షత్రం వారు ఉత్తమమైన

గుణములు కలిగి యుండుట, ఇతరులచే ప్రశంసింపబడతారు. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య - '5'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్ :** ఈ రాశి వారికి లాభస్థానమందు రవి గురుల సంచారంచే అనుకూల ఫలితాలుంటాయి. గృహమున ఉత్సవ వాతావరణము, ప్రతిదినము మధురములగు పదార్థములను తినుట, ధనలాభములు కల్గును.

**మే :** ఊహించని లాభాలను తెస్తుంది. ప్రశంసలు పొందుతారు. వ్యాపారం కూడా లాభదాయకంగా ఉంటుంది మరియు ఆదాయ అవకాశాలు పెరుగుతాయి. పదోన్నతి లేదా వేతనాలు పెరిగే అవకాశాలు కూడా ఉన్నాయి.

**జూన్ :** ఈ సమయంలో పెట్టుబడులు లాభదాయకంగా ఉంటాయి. ఆర్థిక స్థితి మెరుగుపడుతుంది. ఆరోగ్య విషయాలకు కూడా ఇది అనుకూలమైన కాలం. ఈ కాలంలో శీతల ప్రాంతాలలో ప్రయాణాలు ఫలవంతంగా మారుతాయి.

**జూలై :** ఆరోగ్య విషయాలలో జాగ్రత్తగా ఉండాలి. గుండె, రక్తపోటు, తలనొప్పి మరియు కళ్లకు సంబంధించిన కొన్ని సమస్యలు సంభవించవచ్చు. కోపాన్ని మరియు చికాకును అదుపులో ఉంచుకోవాలి. ఆర్థిక అడ్డంకులు ఎదురవుతాయి.

**ఆగష్టు :** స్వభావ సంబంధిత సమస్యలను ఎదురవుతాయి. నాలుకను అదుపులో ఉంచుకోవాలి కుటుంబంలో ప్రమోషన్ లేదా జీతం పెరుగుతుంది. ఇది పురోగతి, ఆనందం, మంచి ఆరోగ్యం మరియు సంపదలో పెరుగుదల కాలం.

**సెప్టెంబర్ :** మానసిక ఒత్తిళ్లు మరియు ఆందోళనలను అధిగమిస్తారు. మీ బంధువులు మరియు స్నేహితులు మీ విలువను గుర్తించి మీకు గౌరవం ఇస్తారు. చాలా మానసిక ప్రశాంతత మరియు ఉపశమనాన్ని అనుభవిస్తారు.

**అక్టోబర్ :** ఉద్యోగ జీవితంలో సమస్యలు. వ్యాపారస్తులకు అధికారుల వత్తిడి. ఈమాస ప్రారంభంలో ఉదర సంబంధ రుగ్మత ద్వితీయార్ధంలో ఉపశమనం, ఈ సమయంలో ప్రత్యర్థుల వ్యూహాలను తిప్పి కొడతారు.

**నవంబర్ :** కృతజ్ఞతా పూర్వకంగా ఉండటం వలన మీ శోభ పెరుగుతుంది. ప్రయాణాలు కూడా లాభదాయకంగా ఉంటాయి. ప్రియమైనవారితో నాణ్యమైన సమయాన్ని గడపడానికి కూడా మీకు అవకాశం లభిస్తుంది.

**డిసెంబర్ :** ఇది ఆనందదాయకమైన, అదృష్టవంతమైన కాలం. మీ ప్రయత్నాలలో విజయం పొందుతారు. వ్యాజ్యాల విషయాల్లో కూడా ఉపశమనం కనిపిస్తుంది. మీ స్థితి మరియు సంపాదన కూడా మెరుగుపడుతుంది.

**2025 జనవరి :** మీఆశయాలను, లక్ష్యాలను సవనం చేసుకుని, అవరోధాలను అధిగమించి, సహనం మరియు శాంత స్వభావంతో అన్నింటిలోనూ విజయం సాధిస్తారు. వాహన చోదకులకు ప్రయాణాలలో జాగ్రత్త వహించాలి.

**ఫిబ్రవరి :** చట్టపరమైన సమస్యలు వస్తాయి. ఆరోగ్యపరంగా జాగ్రత్త అవసరం. తలనరాలు నొప్పి, అజీర్ణం, రక్త ప్రసరణ సమస్యలు మరియు పైల్స్ కంప్లైంటు వంటి సమస్యలు. కొన్ని అనవసర ఖర్చులు మరియు నష్టాలు.

**మార్చి :** ధనాన్ని అధికంగా ఖర్చు చేసినట్లు, ఆరోపణలు, ఇబ్బందులు పడే అవకాశం ఉంది. ఛాతీ, గొంతు, వెన్నెముక, మోకాలు మరియు తుంటికి సంబంధించిన కొన్ని ఆరోగ్య సమస్యలు కూడాఉంటాయి.






| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 14 | వ్యయం | - 2 |
| రాజపూజ్యం | - 6 | అవమానం | - 6 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు లాభస్థానమందు గురుడు తామ్రమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా అష్టమ స్థానమందు రజితమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు భాగ్య, తృతీయ స్థానములందు సువర్ణ మూర్తులుగాను సంచరింతురు. గౌరవం, ప్రతిష్ఠ మరియు సంఘంలో సముచిత స్థానం వస్తుంది. సంతానం కుటుంబానికి మద్దతుగా ఉంటారు. అన్ని ప్రయత్నాలలో విజయం సాధిస్తారు. వీరికి ఆదాయం, వ్యాపారంలో లాభాలు పెరుగుతాయి. మే నెల ప్రారంభం నుండి బృహస్పతి వ్యయ స్థానమందు సంచరించుట ఆశావహమైన సమయం. లాభస్థానమందలి గురుడు సుఖసౌఖ్యాలు కల్పించుటకు హేతువు. గడచిన చాలా సంవత్సరాలుగా పడుతున్న కష్టానికి గుర్తింపు గౌరవ సన్మానాదులు కలుగుతాయి. ఆదాయం, ఉద్యోగం వచ్చే అవకాశాలు పెరుగుతాయి. వ్యాపారంలో విజయం, ముందంజ వేస్తారు. అవివాహితులకు వివాహాది శుభయోగములు. ఇతరులపట్ల సానుకూల ధోరణి, ఉపకార స్వభావంతో దయాగుణం కల్గి కల్గి యుంటారు. మీకు గౌరవమిస్తూ మీచుట్టూ ఉంటూ మిమ్ముల నుండి మంచి ఆశించే వ్యక్తులు ఉంటారు. మీరంటే ప్రాణమిచ్చే వ్యక్తులు మీకు మిత్రులవడం మీ అదృష్టం. మీకు అన్ని విధాలుగా సహాయం చేసే మిత్రులు మీ విజయానికి కారణమవుతారు.

కర్కాటక రాశి వారికి అష్టమ స్థానమందలి శని సంచారము మిశ్రమ ఫలితాల నిస్తుంది. మీరు స్వీయకృషితో అనేక మార్గాలలో అవకాశాలను వెతుక్కుని ముందడుగు వేసే అవకాశం లభిస్తుంది. మీలో దాగి ఉన్న సృజనాత్మక శక్తి బయటకు వచ్చి మిమ్ములను ఉన్నత స్థితిలో ఉంచుతుంది. మీరు ఇతర వ్యక్తుల అవసరాలను తీర్చేలా వారికి సహాయం చేయగల్గుతారు. రాజకీయ నాయకులు, న్యాయవాదులు వారి లోతైన ఆలోచనతో ప్రభుత్వపరమైన అక్రమపాలన సంబంధించి లోతైన రహస్యాలను ఛేదించి, వాటిని బహిర్గతం చేయడంద్వారా విజయవంతమైన రాజకీయ జీవితాన్ని పొందుతారు.

భాగ్య స్థానంలో రాహువు సంచారం వలన కొన్ని శారీరిక మానసిక ఇబ్బందులను ఎదుర్కొనవలసి వస్తుంది. భగవంతునిపై విశ్వాసంతో, కష్టపడి పనిచేస్తూ, జీవనమున పురోగమనము సాధిస్తారు. కుటుంబ సభ్యులను, ఇతరులను ప్రేమగా దయతో చూస్తారు. పంచమ స్థానమందు కేతువు సంచారం, భావోద్వేగానికి గురిచేసి కొంతమేరకు అనైతికంగా ప్రవర్తిస్తూ చెడు ప్రలోభాలకు గురయ్యేటట్టుచేసి సాధారణ జీవనవిధానానికి ఆటంకం కలిగేటట్టు చేస్తుంది. అదే సమయంలో మీకు మతవిశ్వాసాలపట్ల, భగవంతునిపై నమ్మకం మరియు భక్తి కల్గుతుంది. మీ పెద్దలు చూపిన మార్గంలో నడుస్తారు మరియు కీర్తిని సంపాదించుకుంటారు. మీ సోదరులు,

స్నేహితులతో సత్సంబంధాలు కలిగియుండటం మీకు ఎల్లప్పుడూ కలసి వచ్చే అంశం. పునర్వసు4 వారికి అనుకూలం. పుష్యమి నక్షత్రం వారికి గౌరవం, ఆశ్రేష వారికి ప్రతిబంధకములు తొలగుతాయి. దుష్పరిణామాలను అధిగమించుటకు హనుమాన్ చాలీసా, శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం నిత్యం పఠించుట వలన ఆత్మ సంతుష్టి. ఆశయసిద్ధి కలుగుతుంది. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య - **'2'**.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్ :** అష్టమ కుజ ప్రభావం వలన ఆరోగ్య స్థితిని కాపాడుకొనుట అవసరం. నిత్యం సూర్య, సుబ్రహ్మణ్య ఆరాధన, అశ్విని దేవతలకు, వైద్యనాథ, ధన్వంతరి మొదలగు విష్ణు దేవతాకమైన దేవతలను పూజించాలి.

**మే :** గత ఏడాది చేసిన అప్పులను చాలా వరకు తీర్చగల్గుతారు. అష్టమస్థానంలో శని సంచారం వలన ప్రతిబంధకములు, ఇష్టములు లేని పనులు చేయవలసి వచ్చినమా అన్నిటినీ అధిగమిస్తారు.

**జూన్ :** మీరు మీఅపారమైన తెలివితేటలతో సభలలో ప్రత్యర్థులను అబ్బురపరుస్తారు. ప్రజాదరణ, అభిమానాన్ని చూరగొంటారు. ఇతరులకు మీపై సానుకూల ధోరణి ఉంటుంది. ధనధాన్యాలు వృద్ధి చేస్తారు. విజయ కాంక్షతో ఉంటారు.

**జూలై :** సీనియర్లతో సమస్యలను ఎదుర్కొనుటకు సహనంగా ఉండాలి. ఆరోగ్యం పట్ల కూడా శ్రద్ధ అవసరం.

**ఆగష్టు :** శత్రువుల విషయంలో అప్రమత్తంగా ఉండండి. చెడు సహవాసాలను వదిలివేస్తే, శుభ ఫలితాలను, మంచి ఆరోగ్యాన్ని మరియు మరిన్ని ఆదాయ అవకాశాలు కల్గుతాయి. వ్యాపారం కూడా లాభదాయకంగా ఉంటుంది.

**సెప్టెంబర్ :** మీ ఆదాయానికి మంచి ప్రోత్సాహం కల్గుతుంది. మీ తోబుట్టువుల నుండి కూడా కొన్ని లాభాలు కల్గుతాయి. పిల్లల విషయంలో వృద్ధి. సంతోషకరమైన శుభవార్తను వింటారు. సమాజంలో మీ హోదా మరియు గౌరవం పెరుగుతాయి.

**అక్టోబర్ :** ప్రతికూల పరిస్థితులను అర్థం చేసుకోలేకపోవడం, అహంకారానికి గురి అవ్వడం, అబద్ధమాడవలసి రావడం, స్వయం నిర్ణయాధికారాన్ని కోల్పోవడం జరుగుతుంది. కోరికలు నెరవేరుతాయి. సంపద, ఆస్తిపెరుగుతాయి.

**నవంబర్ :** పిల్లల విషయాలు సంతృప్తికరంగా ఉంటాయి. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. గాయాల పాలవడం, వాహన అవరోధాలు కల్గే అవకాశం. భాగస్వామ్య వ్యాపారాలు వద్దు. కుటుంబ సభ్యుల ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం.

**డిసెంబర్ :** సహోద్యోగులతో వివాదాలను ఉత్తమంగా తప్పించుకోవాలి. విద్యార్థుల ప్రయత్నాలు కార్యరూపం దాలుస్తాయి. చదువు విషయంలో మరింత కృషి మరియు శ్రద్ధ అవసరం కావచ్చు.పెట్టుబడులకు సమయం కాదు.

**2025 జనవరి :** ఆర్థిక విషయాలలో శ్రద్ధ అవసరం. అనవసర ఖర్చులు తగ్గించుకోవాలి. మానసిక ఒత్తిడి, వాదనలకు దూరంగా ఉండాలి. ముఖ్యంగా గుండె మరియు పొట్టకు సంబంధించిన ఆరోగ్య సమస్యలు పెరుగుతాయి.

**ఫిబ్రవరి :** వ్యయరాశిలో కుజ వక్రం ముగియడం శుభ ఫలితాలను మంచి ఆరోగ్యాన్ని మరియు మరిన్ని ఆదాయ వనరులను కల్పిస్తుంది. మీరు స్నేహితుల నుండి మద్దతు పొందుతారు. రియల్ ఎస్టేట్ పెట్టుబడులకు సరైన సమయం.

**మార్చి :** ఈ కాలంలో ఉద్యోగ, వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటుంది. సమాజంలో మీ హోదా మరియు గౌరవం పెరుగుతాయి. ప్రభుత్వపరంగా మద్దతు, గుర్తింపు వస్తాయి. కుటుంబ విషయాలు సంతృప్తి కరంగా ఉంటాయి.






| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 2 | వ్యయం | - 14 |
| రాజపూజ్యం | - 2 | అవమానం | - 2 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు దశమస్థానమందు గురుడు సువర్ణమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా సప్తమస్థానమందు లోహమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు అష్టమ, ద్వితీయ స్థానములందు తామ్రమూర్తులుగానూ సంచరింతురు. బృహస్పతి సంచారం సానుకూల ఫలితములనిస్తుంది. ఉద్యోగస్తులకు పనిచేసే చోట ఆటంకాలను ఎదుర్కొనవలసివస్తుంది. పై అధికారుల ఆగ్రహ, అహంకారాలను చవిచూడవలసి వస్తుంది. గోచార రీత్యా దశమ గురుడు పీడను కలుగజేస్తాడు. మూర్తివంతముచే గురుడు శుభుడు గాన క్రింది ప్రతికూల పరిస్థితులను అధిగమించగల్గుతారు. ఉద్యోగస్తులకు చేసే ఉద్యోగంలో మార్పు వస్తుంది. వీరికి సంవత్సర ప్రారంభంలో కుటుంబ సౌఖ్యం లోపించుట, గృహవాతావరణం సరిగా లేకపోవడం, ఇంట దొంగలు పడటం వంటి దుష్ఫలితముల విషయంలో జాగ్రత్త అవసరం. తదుపరి వృత్తి వ్యాపార ఉద్యోగాలలో పురోగమనం కలిగి విజయం సాధిస్తారు. రాజకీయ నాయకులు, ప్రభుత్వం మరియు ప్రజలతో సత్సంబంధాలను కలిగియుండుట వలన అనేక రకాలుగా లబ్ధి పొందుతారు. వైవాహిక జీవనం ఆశావాదంగా ఉండి, కుటుంబ వృద్ధిని, సమాజంలో గౌరవం, ఆదరణ కలిగి యుంటారు. రాజకీయ నాయకులు ఎన్నికలలో విజయం సాధిస్తారు. అన్ని రకముల వ్యాపారస్తులకు, రైస్ మిల్లర్లకు గతం కంటే అనుకూలమైన సమయం. క్రమేపీ నిరాశను వీడి ఉత్సాహంవైపు నడుస్తారు.

సింహరాశికి కళత్రస్థానమైన కుంభరాశిలో శని సంచారం కూడా మిశ్రమ ఫలితాలనిస్తుంది. వైవాహిక జీవనం, భార్య ద్వారా సంక్రమించే ఆస్తులు, వ్యాధులు, ఇతరులచే తప్పులు వేలెత్తి చూపబడటం మరియు శత్రువులు సంబంధాలు మరియు భాగస్వామ్య వ్యాపారాలు మొదలగునవి ప్రభావితం అవుతాయి. మీ భవిష్యత్తు, సంపాదన, మీరు చేసే వ్యాపారాలు మొదలగు విషయాలలో మీ ప్రయత్నాలు ఆలస్యంగా ఫలితాల నిస్తాయి. అన్ని విషయాలలోనూ సంయమనము నైతిక విలువలు పాటించడం వలన చట్టపరమైన మరియు నైతిక మార్గదర్శకాలకు అనుగుణంగా పనిచేస్తే ఈ చికాకులను అధిగమించవచ్చు. రాహువు అష్టమ స్థానమందునూ, కేతువు ధన స్థానమందును వ్యవహార ప్రతిబంధకములను కలుగజేస్తాడు. లైంగిక వ్యాధులకు గురయ్యే అవకాశం ఉంది మానసిక క్షోభ ఉంటుంది. నీచమైన కార్యకలాపాలకు పాల్పడకుండా జాగ్రత్త వహించాలి. మఖ నక్షత్రం వారికి అధిక రక్తపోటు, సంతానవృద్ధి, పుబ్బ నక్షత్రం వారికి, వర్తక వ్యాపారాలు సామాన్యం, వివాహం

ఆలస్యం ఉత్తర 1 నక్షత్రం వారికి సర్వత్రా జయం మొదలగు ఫలితాలుంటాయి. విష్ణు సహస్రనామ స్తోత్రం వినడం, దుర్గా ఆరాధన, దక్షిణామూర్తి ధ్యాన శ్లోకములు లేక గురు సంబంధ పారాయణాలు చేయుట వలన కొంతవరకు మంచి ఫలితములు కలుగును. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య - '1'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్:** దూరప్రాంతాలకు వెళ్లవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాలు అనుకూలం కారు. కొన్ని చట్టపరమైన సమస్యలకు, కోర్టు వ్యవహారాలకు పరిష్కార దిశలో వెళ్తే మంచిది. ఆరోగ్యాన్ని కూడా జాగ్రత్తగా చూసుకోవాలి.

**మే:** అజీర్ణం, రక్త ప్రసరణ సమస్యలు మరియు పైల్స్ మిమ్మల్ని ఇబ్బంది పెట్టొచ్చు. నిరుత్సాహం లేదా అసౌకర్య భావనను తొలగించుకొనుటకు యోగాభ్యాసం వంటివి చేయడం మంచిది.

**జూన్:** వ్యాధి నుండి ఉపశమనం, ఆదాయాన్ని మరియు వృద్ధిని పొందుతారు. అందరితో సత్సంబంధాలుంటాయి. అనేక మార్గాలలో ఆదాయం లభిస్తుంది. వ్యాపారస్తులకు పంట పండుతుంది. లాభాల బాటన పయనిస్తారు.

**జూలై:** అన్ని రకాల వృత్తులవారికి అధికాదాయం యత్నకార్య సిద్ధి అవుతుంది. ఆరోగ్యం మెరుగవుతుంది. మనసు ఉల్లాసంగా ఉంటుంది. భూమి గృహ స్థిరాస్తులను కూడబెట్టే అవకాశం ఉంటుంది.

**ఆగష్టు:** సంపద, ఆనందం, విద్యలో విజయం, వివాహ అవకాశాలు, వినోదం మరియు వ్యాపారంలో వృద్ధిని పెంచుతుంది. చెడు సావాసాల వలన తిరోగమనావకాశాలుంటాయి. ప్రయాణాలు వాయిదా వేయండి.

**సెప్టెంబర్:** శుభ వార్తలు వింటారు. ఆరోగ్యాన్ని మరియు ఆదాయ అవకాశాలను ఇస్తుంది. స్నేహితుల నుండి మద్దతు పొందుతారు. రియల్ ఎస్టేట్ పెట్టుబడులకు ఇది సరైన సమయం. వివాహ అవకాశాలు, వినోదం మరియు వ్యాపారంలో వృద్ధి.

**అక్టోబర్:** వ్యాపారం లాభదాయకంగా ఉంటుంది. అందరి నుంచి మంచి ప్రోత్సాహాన్ని పొందుతారు. తోబుట్టువుల నుండి అనుకూల వాతావరణం . పిల్లల విషయాలు కూడా సంతోషాన్ని మరియు శుభవార్తను అందిస్తాయి.

**నవంబర్:** మీ హోదా మరియు గౌరవం పెరుగుతాయి. స్నేహితుల నుండి లాభాలు, వ్యాపార వృద్ధి, శత్రువుల పతనం ధైర్యం మరియు అదృష్టాన్ని పెంచడం, శుభవార్త రాక మరియు ప్రభుత్వం నుండి సహాయం వస్తుంది.

**డిసెంబర్:** మీ తోబుట్టువులు మీతో మంచి సమయాన్ని గడపడానికి ఇష్టపడతారు. మీకు మంచి సామాజిక జీవితం ఉంటుంది. సంగీతం, కళలు మొదలైన సృజనాత్మక విషయాలలో సమయాన్ని వెచ్చించే అవకాశం ఉంది.

**జనవరి:** విలాసాలను అనుభవిస్తారు. సమస్త కోరికలు నెరవేరుతాయి. సంపద, ఆస్తి కూడబెట్టుకునే అవకాశం ఉంది. ఆస్తి, పేరు, కీర్తి మంచి ఆదాయం, కుటుంబంలో ఆనందం, మంచి ఆరోగ్యం కల్గుతాయి.

**ఫిబ్రవరి:** జీవిత భాగస్వామి మరియు పిల్లలతో సమయాన్ని గడపడానికి ఇష్టపడతారు. మీరు కొత్త స్నేహితులను కూడా సంపాదించుకుంటారు మరియు ఆనందకరమైన జీవనశైలిని కలిగి ఉంటారు. పిల్లల విషయాలలో సంతోషాన్ని కలిగిస్తుంది.

**మార్చి:** శ్రద్ధ చేసి చదివి పరీక్షలలో విజయం సాధిస్తారు. స్వయం వృత్తులవారికి అనేక రకాలుగా లాభాలు ప్రోత్సాహకాలు వస్తాయి. మీ స్నేహితులు, సలహాదారులు మరియు పెద్దలు మీకు విలువ ఇస్తారు మరియు మీతో మంచిగా వ్యవహరిస్తారు.






| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | 5 | వ్యయం | - | 5 |
| రాజపూజ్యం | - | 5 | అవమానం | - | 2 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు భాగ్యస్థానమందు గురుడు రజితమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా షష్ఠస్థానమందు తామ్రమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు సప్తమ, జన్మస్థానములందు రజితమూర్తులుగానూ సంచరింతురు. భాగ్య గురుడు సర్వ కార్యములందు లాభము, సంతుష్టిని కలుగజేస్తాడు. అన్ని రంగముల వారికి సమాజంలో గౌరవం పెరుగుతుంది. ధనాభివృద్ధి, అసంపూర్ణంగా నిలచిన పనులు పూర్తవుతాయి. మాట విశ్వాసాలపట్ల శ్రద్ధ వహిస్తారు. కొత్తగా తలపెట్టిన పనులు సత్వరమే పూర్తి చేసి ఆశించిన ఫలితాలను పొందుతారు. ఉద్యోగస్తులకు ప్రమోషన్ ఆర్థిక పరిపుష్టి కలుగుతుంది. వ్యాపార వర్గాలవారు స్వయం వృత్తుల వారికి ధనాదాయం పెరుగుతుంది. తీర్థ యాత్రలు, విదేశీయులను కలసి వారితో సంప్రదింపులు, భార్య తరపు వారి నుంచి సహాయం, కోర్టు వ్యవహారములలో విజయం. వృత్తిపరంగా ఎదగడానికి ఇది మంచి సమయం. ఉద్యోగస్తులు పై అధికారులతో సత్సంబంధాలు కలిగియుంటారు. ఇంక్రిమెంట్ లేదా ప్రమోషన్ కూడా పొందవచ్చు. పెద్దల ఆశీస్సులు లభిస్తాయి. వివాహానికి కూడా ఇదే మంచి కాలం. విదేశీ ప్రయాణాలు కలసి వస్తాయి. పరిశోధనా రంగం వారికి రచయితలకు విస్తరణ చెందే కాలం ధర్మాన్ని అతిక్రమించరు కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతారు. చిరకాల సమస్యలకు ఆనందదాయకమైన పరిష్కారం లభిస్తుంది.

కన్యారాశి వారికి కొత్త ఆలోచనలు విశాల దృక్పథం సృజనాత్మకత వంటి విషయాలు ప్రభావితం అవుతాయి. వ్యాపారస్తులు కఠినమైన నిర్ణయాలతో రాబోయే సవాళ్లను ఎదుర్కొనేందుకు సిద్ధపడతారు. అన్నింటా విజయం. మీ పిల్లల చదువుల విషయంలో వారికి చక్కని తోడ్పాటు ఇచ్చి వారు విజయం సాధించేలా ప్రేరణను ఇస్తారు. బంధు మిత్రులతో సత్సంబంధాలు కలిగియుండటం విశేషం. వృత్తి వ్యాపారాలలో ప్రత్యర్థులతో పోటీ పడి ముందుకు దూసుకుపోతారు. కుటుంబ సభ్యులు మరియు బంధువులతో సుఖ సంతోషాలను పంచుకుంటారు.

మీ పిల్లల ఇల్లు, విద్య, సృజనాత్మకత మరియు మంచి పనులు మరియు వ్యాధులు, ఋణం మరియు శత్రువుల ఇంటిపై దాని ప్రభావంతో, శని పరాక్రమవంతులైన కన్యారాశికి కొత్త ఆలోచనలు మరియు సృజనాత్మకత రాకకు దారితీస్తుంది. పని, అప్పులు, వ్యాధులు విషయాలను ప్రభావితం చేసే షష్ఠ భావంలో శని సంచారం అనుకూల ప్రభావాలను ఇస్తుంది. ఉద్యోగ విషయాల్లో పెరిగిన బాధ్యతలు నేపథ్యంలో వత్తిడి పెరుగుతుంది. క్రమశిక్షణ మరియు పనినైపుణ్యం కారణంగా ఇతరదేశములకు వెళ్లే అవకాశం ఉంది. రాహువు కామోద్రేకానికి గురి అయ్యే అవకాశం లేకపోలేదు. చాలా ఆర్థిక ఒడిదుడుకులను ఆశించవచ్చు. కొంత

సంపద నష్టం కూడా జరగవచ్చు. డబ్బుకు సంబంధించిన విషయాలలో జాగ్రత్తగా ఉండాలి. ఈ సమయంలో పునరావృతమయ్యే వివాదాల కారణంగా వైవాహిక జీవితం కూడా అస్తవ్యస్తంగా ఉంటుంది. జీవిత భాగస్వామి ఆరోగ్యం కూడా ఆందోళన కలిగించే అంశంగా మారవచ్చు. ఈ రాశి వారి అదృష్ట సంఖ్య '5'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్:** జననేంద్రియాలు మరియు పునరుత్పత్తి వ్యవస్థకు సంబంధించిన రుగ్మతలు, ప్రయాణంలో సమస్యలు, జీవిత భాగస్వామికి బాధ. ఈ కాలంలో అధికారం లేదా ప్రభుత్వం నుండి గుర్తింపు లేదా ప్రతిఫలం లభిస్తుంది.

**మే:** అన్ని ప్రయత్నాలలో విజయం వరిస్తుంది. వ్యాపారం పెరుగుతుంది, జ్ఞానం వృద్ధి చెందుతుంది. మీరు చదువులో పురోగతి, వాహనం, సంపద మరియు విలాసవంతమైన జీవితం వంటి సౌకర్యాలతో జీవనశైలి సంపన్నమవుతుంది.

**జూన్:** ప్రభుత్వం నుండి సత్కార పురస్కారాలు లభిస్తాయి. తండ్రితో వాదనలు, వివాదాలు నివారించుట మంచిది. దూర ప్రయాణాలు అనుకూలిస్తాయి. చదువుల్లో వృద్ధి కనబడుతుంది. ఆధ్యాత్మిక విషయాలలో దాన ధర్మాలలో ముందు ఉంటారు.

**జూలై:** సంపద మరియు కీర్తి పెరుగుతుంది. స్నేహితుల నుండి మద్దతు మరియు ప్రయత్నాలలో విజయం పొందుతారు. గృహ విషయాలకు మరియు సంబంధాలకు మంచిది. మీరు ఆర్థిక సమస్యల నుండి కూడా బయటపడతారు.

**ఆగష్టు:** మీ ఇల్లు దొంగతనానికి గురికాకుండా జాగ్రత్త మరియు అప్రమత్తత అవసరం. అధిక ఆదాయాన్ని పొందుతారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. విదేశీ పర్యటనలో అనవసరమైన ఖర్చు మరియు డబ్బు వృధా అవుతుంది.

**సెప్టెంబర్:** సంపద, ఆనందం, విద్యలో విజయం, వివాహ అవకాశాలు, వినోదం మరియు వ్యాపారంలో వృద్ధిని పెంచుతుంది. ఇతరులను శాసించాలనే దృక్పథం వీడితే సీనియర్లతో మరిన్ని సమస్యలను తగ్గించుకోవచ్చు.

**అక్టోబర్:** ఆత్మ విమర్శ చేసుకుని ప్రశాంతంగా ఉండడానికి ప్రయత్నించాలి. ఆరోగ్యం పట్ల కూడా శ్రద్ధ అవసరం. శత్రువులను విస్మరించడం మంచిది, ఆయుధాల వలన, చెడు సావాసాల వలన ముప్పు ఎదురుదెబ్బ తగలవచ్చు.

**నవంబర్:** శుభ ఫలితాలను తెస్తుంది. మంచి ఆరోగ్యాన్ని మరియు మరిన్ని ఆదాయ అవకాశాలను అందిస్తుంది. రియల్ ఎస్టేట్ పెట్టుబడులకు సరైన సమయం. వ్యాపారం లాభదాయకంగా ఉంటుంది. మానసిక బలం కలిగి ఉంటారు.

**డిసెంబర్:** అధికారం, సమాజంలో ఉన్నత స్థానం లభిస్తుంది. భౌతిక సుఖాలను, విలాసాలను అనుభవిస్తారు. మీరు కొత్త స్నేహితులను కూడా సంపాదించుకుంటారు మరియు ఆనందకరమైన జీవనశైలితో జీవనంలో ముందుకు సాగుతారు.

**జనవరి:** ఆరోగ్య సమస్యల గురించి నిరంతరం భయం, కొంత మానసిక క్షోభ. మార్గావరోధాలను నిరోధించుటకు దూర ప్రయాణాలు మానండి. అధికారుల వలన గానీ లేదా ప్రభుత్వం నుండి గుర్తింపు లేదా ప్రతిఫలం వస్తుంది.

**ఫిబ్రవరి:** నెల మొదటి వారంలో స్టాక్ మార్కెట్‌లో పెట్టుబడి పెట్టాలనే భ్రమను వీడండి. ఉద్యోగంలో నిదానం ఉన్నతి కలుగవచ్చు. వృత్తి వ్యాపారాలలో ఇతరులపై ఆధిపత్యం ప్రదర్శిస్తారు. ధనాదాయం పెరుగుతుంది.

**మార్చి:** ప్రయాణంలో సమస్యలు, ఖర్చులు పెరగడం మరియు ప్రేమ విషయాలలో అసంతృప్తి కల్గుతుంది. మీరు మీ జీవిత భాగస్వామి మరియు పిల్లలతో సమయం కేటాయించుకుని మెరుగైన సంభాషణను ఏర్పరచుకోవాలి.






ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు అష్టమస్థానమందు గురుడు లోహమూర్తిగాను, శనైశ్చరుడు సంవత్సరమంతా పంచమ స్థానమందు రజితమూర్తిగాను, రాహుకేతువులు సంవత్సరమంతా షష్ఠ, వ్యయస్థానములందు లోహమూర్తులుగాను సంచరింతురు.

తులారాశి వారికి గురుడు వ్యయాన్ని, సానుకూల మరియు ప్రతికూల ఫలితాలనిస్తాడు. ఒకవైపు దీర్ఘాయుర్దాయం, ఆరోగ్యం, తండ్రి నుండి సంక్రమించిన సంపద మరియు పరిశోధనలు వృద్ధిపథంలో నడుస్తుంటే, మరోవైపు అప్పులు, అడ్డంకులు, విపత్తులు మరియు పుట్టుకతో వచ్చిన లోపాల వలన ఇబ్బంది, పనిచేసేచోట తోటివారితో మీ ప్రవర్తన వివాదాలను సూచిస్తుంది. గతంలో తీసుకున్న ఋణాలను త్వరిత గతిన తీర్చలేకపోవడం, జీవనంలో పురోగమనం చెందుటకు తగిన జాగ్రత్తలను సమయ నియమాన్ని పాటించాలి. వేతన వృత్తి వారికి సామాన్య ఫలితాలుంటాయి. ఆధ్యాత్మిక విషయాల్లో మాత్రం పురోగతి కనబడుతుంది. విద్యార్థులకు చదువుల్లో ఉన్నతిని సూచిస్తోంది. ధనం ఖర్చుచేసి ఇతర దేశాలకు వెళ్ళడం జరుగుతుంది. మీకు రావాల్సిన డబ్బు విషయంలో న్యాయస్థానాలను ఆశ్రయించవలసి వస్తుంది. తరచూ ప్రయాణాలు ఆర్థికంగా అస్థిరత్వం ఉంటుంది. వ్యాపార విషయాల్లో ఆకస్మిక సంఘటనలు ఎదుర్కొనవలసి వస్తుంది. కుటుంబ సభ్యులు, మిత్రులతో సంబంధాలను సరిచూసు కోవాల్సి ఉంటుంది. అష్టమ గురుని ప్రతికూల ఫలితాలను ఎదుర్కొనుటకు యోగాభ్యాసము, ప్రాణాయామము, నడక వంటి ఆరోగ్య క్రమబద్ధీకరణ సూత్రాలను పాటించవచ్చు.

పంచమ స్థానమైన కుంభరాశిలో శని సంచారం అనుకూలమైన ఫలితాల నిస్తుంది. దీని ప్రభావం వలన వృత్తి వ్యాపారాలు, కుటుంబం, విద్యా విషయాలలో అపారమైన వృద్ధి కలుగుతుంది. ఉద్యోగ విషయాలలో ప్రమోషన్, కొత్త ఉద్యోగం పొందడానికి అనుకూలమైన సమయం. అక్టోబర్, నవంబర్ డిసెంబర్ మాసాల్లో అష్టమ స్థానమందు గురుడు వక్రం ధనవ్యయం, ఆరోగ్య సమస్యల విషయాల్లో దృష్టి ఉంచాలి. ఇక రాహుకేతువుల సంచారం కలిసొచ్చే అంశం. శత్రుజయం, ఆకస్మిక ధనలాభాలు, ఆరోగ్య పరిపుష్టి, ఉద్యోగ వృత్తి విషయాల్లో ముందంజ, కొత్తపథకాలను అన్వేషించి, అనుసరిస్తారు. యంత్ర సామగ్రి సమకూర్చు వ్యాపారం వారికి సామాన్య ఫలితాలు, రైస్ మిల్లర్లు నూతన పనిముట్లు వాడడం, నవీన యాంత్రీకరణ క్రమబద్ధం చేస్తారు. సంవత్సర ద్వితీయార్థంలో కళ్యాణ వేదికల అలంకరణల వారు, పువ్వుల వ్యాపారులు అధిక ధనాదాయాన్ని సంపాదిస్తారు. ఉద్యోగార్థులకు ఉద్యోగం వస్తుంది. చిత్ర నక్షత్రం వారి సంతానం సృజనాత్మకత

సాధిస్తారు. స్వాతి నక్షత్రం వారికి సర్వత్రా అనుకూలం. నూతన గృహయోగం, విశాఖ నక్షత్రం వారికి కుటుంబ వృద్ధి, సంతానం అన్ని రంగాలలో రాణిస్తారు. ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 6.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్:** ఆర్థిక వృద్ధి, ఇతరులపై పట్టు సాధించుట, వృత్తివ్యాపారాలు కలిసి వస్తాయి. ఉద్యోగస్తులకు అనుకూల సమయం. సమాజంలో ఆదరణ పెరుగుతుంది. సాంఘిక సంబంధాలు మెరుగవుతాయి.

**మే:** తండ్రికి అనారోగ్య సూచన, స్వస్థానం విడిచి వేరే చోట ఉండవలసి వచ్చుట, కుటుంబ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకుని కలహాలను నివారిస్తారు. కుటుంబ ముఖ్య ఉన్నత ఆశయాలకు కృషి చేస్తారు. ఆర్థిక లాభాలు వస్తాయి.

**జూన్:** నెల ప్రారంభంలో విశేష ఫలితాలు తరువాత సామాన్యము. ఆనందభరితమైన జీవితాన్ని పొందుతారు. కోపతాపాలను ఆవేశాన్ని అదుపులో ఉంచుకోవాలి. కంటి సంబంధిత వైద్య చికిత్స పొందుతారు.

**జూలై:** ముఖ్యకార్యసిద్ధి విద్య, వృత్తి పరంగా ముందంజ. లక్ష్యాలను సకాలంలో పూర్తి చేసి అందరి మన్ననలను పొందుతారు. కొత్త ఉద్యోగంలో చేరే అవకాశం ఉంటుంది. ఆర్థికంగా వ్యయం సమృద్ధి సాధిస్తారు.

**ఆగస్టు:** ఏకాదశ స్థానమందు రవి బుధ శుక్రులు అత్యంత యోగప్రదులు. ఈ సమయంలో కొత్త ఆలోచనలు ప్రణాళికలతో భవిష్యత్తుకు ముందంజ వేస్తారు. అనేక రకాలుగా ఆర్థిక వృద్ధి, ఋణవిమోచన కలుగుతుంది.

**సెప్టెంబర్:** మీ ప్రాముఖ్యత అవసరాన్ని అందరూ గుర్తిస్తారు. రాజకీయంగా ఎదుగుదలకు మంచి సమయం. స్థానిక సమస్యలకు న్యాయస్థానమును ఆశ్రయిస్తారు. వస్త్ర భూషణములను ఖరీదు చేస్తారు.

**అక్టోబర్:** మిత్రులతో ఆనందంగా గడిపే సమయం, కుటుంబమున వంశోద్ధారకుల ఆవిర్భవిస్తారు. గృహమున మంగళ తోరణములు, కుటుంబ వాతావరణం అనుకూలం. ఆర్థిక సమతుల్యత, ఆర్థిక వికాసం కల్గుతుంది.

**నవంబర్:** కుటుంబం ఆనందదాయకంగా ఉంటుంది. మంచి ఆరోగ్యం. ఆధ్యాత్మిక వాతావరణం, బంధు మిత్రులతో సత్సంబంధాలు ఏర్పరచుకుంటారు. సత్సంతానికి వివాహ విషయాలలో ముందంజ వేస్తారు.

**డిసెంబర్:** విద్యార్థులు నాయకత్వ లక్షణాలు పెంచుకుని, వక్తృత్వపు పోటీల్లోను, పోటీ పరీక్షల్లోను విజయం సాధిస్తారు. వ్యవసాయదారులకు అధిక దిగుబడి వలన ఆదాయం, అన్ని వృత్తులవారికి సమృద్ధి.

**2025 జనవరి:** రావలసిన బాకీలు వసూలు అవుతాయి, సోదరవర్గం వారి అండదండ లుంటాయి. వైద్య ప్రణాళికలతో చేపట్టిన కార్యక్రమాలు విజయవంతం చేస్తారు. పుత్ర సంతానప్రాప్తి. కోర్టు విషయాలుఅనుకూలం.

**ఫిబ్రవరి:** మిత్రులలోను బంధువులలోను అవగాహనాలోపంవల్ల చిక్కులు. ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉంటుంది. వైద్య సహాయం అవసర మవుతుంది ఆరోగ్యం కుదుట పడుతుంది. ధనానికి లోటుండదు.

**మార్చి:** ఆదాయ వనరులు పెరుగుతాయి. ఇతరదేశాలకు వెళ్ళే ప్రయత్నాలు కలిసి వస్తాయి. పిల్లల చదువుల విషయంలోను ఉత్సాహకరమైన వాతావరణం ఉంటుంది ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది.






| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 8 | వ్యయం | - 14 |
| రాజపూజ్యం | - 4 | అవమానం | - 5 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు కళత్రస్థానమందు గురుడు తామ్రమూర్తిగాను, శనైశ్చరుడు సంవత్సరమంతా చతుర్థ స్థానమందు సువర్ణమూర్తిగాను, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు పంచమ, ఏకాదశస్థానములందు తామ్రమూర్తులుగాను సంచరింతురు.

సప్తమ స్థాన గురుని సంచారం ఈ రాశి వారికి యోగప్రదంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో పురోగతి, ఉద్యోగ విజయాలనిస్తుంది. కొత్త భాగస్వామ్య పెట్టుబడులు ఆర్థిక స్థిరత్వంతో సానుకూలంగా ఉంటాయి. మంచి చాకచక్యంతో కార్యాలను చక్కబెడతారు. ఇంట్లో ప్రేమ వివాహాలు జరగడానికే అవకాశాలు ఎక్కువ. ఆరోగ్యం బాగుంటుంది. ఎక్కువ జీతం కలిగిన ఉద్యోగావకాశం. వ్యాపారంలో కృషిచేసి ఆదాయం పొందుటకు నాంది ఈ సమయం అవుతుంది.

ఈ రాశివారికి మాతృ, గృహ విషయాలను సూచించే చతుర్థ స్థానమైన కుంభరాశిలో శని సంచారం మీ తల్లి ఇల్లు వంటి కుటుంబ విషయాలను ప్రభావితం చేస్తుంది. విద్యార్థులకు చదువు ప్రభావితం అయి ఆటుపోటులకు గురౌతుంది. ఇది మిశ్రమ ఫలితాలనిస్తుంది. ఆలస్యమైనా విజయం సాధిస్తారు కానీ గత సంవత్సరాలుగా ఆలస్యమవుతున్న న్యాయపరమైన విషయాలు ఒక కొలిక్కి వచ్చి దానిలో విజయం సాధించగలరు. సమృద్ధికి లోటు లేదు కానీ ఎదుగుదల అయితే ప్రస్తుతం సామాన్యంగా ఉంది. మీపై అధికారులతో సంయమనము పాటించడం వలన ముందు ముందు మంచి జరుగుతుంది. రాహుకేతువుల సంచారం ఈ సంవత్సరం మానసిక ఒత్తిడి మరియు ఇబ్బందులను కలుగజేస్తుంది. సంతానం విషయంలో వారి చదువుల్లోగాని మరేదైనా వారికి సంబంధించిన ఇతర విషయాలలో కొంతమేరకు కలవరం తప్పదు. దీనివలన వీరు తాత్కాలికంగా మానసిక క్షోభకు గురౌతారు. వృత్తివ్యాపారాలలో అధిక ఆదాయం మరియు సంపద వచ్చే అవకాశం ఉంది. స్థిరాస్తి కొనుగోలు అమ్మకం వ్యాపారులకు ఇబ్బడిముబ్బడిగా ఆదాయం గతం కంటే చాలా మెరుగవుతుంది. గృహ నిర్మాణం అమ్మకందార్లకు ఆదాయంలో వృద్ధి కనబడుతుంది. సంవత్సర ప్రారంభం మూడు నెలల తరువాత అన్ని వృత్తుల వారికి సంతృప్తికరంగా ఉంటుంది. నవంబర్ నెలాఖరు డిసెంబర్ ప్రథమార్థంలోను జన్మరాశిలో బుధుని వక్రం అష్టమ,భాగ్య స్థానాలలో కుజ వక్రం వలన కలుగు ఆకస్మిక ప్రమాదాలకు అప్రమత్తత అవసరం దూర ప్రయాణాలు మానడం మంచిది. రుద్రాభిషేకం చేయుట, విష్ణు సంబంధ స్తోత్రములు పఠించుట వలన మంచి జరుగును. విశాఖ 4 వారు ఉద్యోగ విజయం, అనూరాధ వారికి గృహమున కళ్యాణ శుభ శోభ, జ్యేష్ఠ నక్షత్రం వారికి కార్యసిద్ధి కల్గుతుంది. అన్నిరకాల వ్యాపారస్తులకు

సామాన్య లాభాలుంటాయి. గణపతి, సుబ్రహ్మణ్య ఆరాధన, దుర్గా ఆరాధన, శివారాధన, ఆంజనేయ స్తోత్రములు పఠించిన మంచి జరుగును. ఈ రాశివారి అదృష్ట సంఖ్య - **'9'**.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్**: ఆరోగ్య విషయాల్లో ఉపశమనం, ప్రయత్నాలు ఫలిస్తాయి. కోర్టు వ్యవహారాలు అనుకూలం. సాంఘికంగా మంచి పరిచయాలు ఏర్పరుచుకుంటారు. ఆనందకరమైన వాతావరణం.

**మే**: ఆరోగ్యం సామాన్యం. పిల్లలతో సమస్యలు కుటుంబ సభ్యులతో వాదనలకు దిగవద్దు. చెడు సావాసాలకు దూరంగా ఉండండి. విద్యార్థుల ప్రయత్నాలకు కార్యరూపం రాకపోవచ్చు.

**జూన్**: చదువు విషయంలో మరింత కృషి మరియు శ్రద్ధ అవసరం. విజయం అన్ని ప్రయత్నాలలో అనుసరిస్తుంది. పెట్టుబడులకు సరైన సమయం కాదు. దూర ప్రయాణాల విషయంలో ఆలోచించాలి. శత్రువర్గం పెరుగుతుంది.

**జూలై**: వాహనం, సంపద మరియు విలాసవంతమైన జీవితం వంటి సాధారణ సౌకర్యాలతో మీ జీవనశైలి సంపన్నంగా ఉంటుంది. మీ ప్రయత్నాలకు అనుగుణంగా ఆదాయం కూడా తగినంతగా ఉంటుంది.

**ఆగస్టు**: వృత్తి వ్యాపారం అనుకూలం, చదువులో పురోగతి ఉంటుంది. జ్ఞాన వృద్ధి చెందుతుంది మరియు అనేక విధాలుగా ప్రయోజనాలను పొందుతారు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ అవసరం. ఇతరులతో పేచీవాదనలు వద్దు.

**సెప్టెంబర్**: ఆశయ సిద్ధి, అహం నుండి ఉపశమనము, ఆర్థిక స్థిరత్వము, అందరికీ ప్రయోజనకారిగా ఆదర్శంగా ఉంటారు. వస్తు వస్త్ర ఆభరణములను కొంటారు. వాహనచోదకులు అప్రమత్తంగా ఉండాలి.

**అక్టోబర్**: ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. గృహనిర్మాణాలు కలిసివస్తాయి. బంధు మిత్రుల సమాగమము, వృత్తిలో లాభము అఖండైశ్వర్యాలు కల్గుతాయి. తలచిన తలంపుగా పనులు పూర్తవుతాయి.

**నవంబర్**: కుటుంబంలో ఆనందంగా గడుపుతారు. తలవని తలంపుగా బంధువుల మీకిష్టమైనవారు మిమ్మల్ని కలుస్తారు. మాట్లాడే సమయోచితంగా మాట్లాడి అందర్నీ కష్టాల నుండి కాపాడతారు.

**డిసెంబర్**: ధనం నిల్వ చేస్తారు. కళత్ర పుత్రులతో సుఖ జీవనం. కుటుంబ వాతావరణం బాగుంటుంది. ఆరోగ్యం, తోబుట్టువులతో అన్నదమ్ములు అక్క చెల్లెళ్లతో సత్సంబంధాలు వారి, సంతాన ఉన్నతికి కృషి.

**2025 జనవరి**: న్యాయస్థానాల చుట్టూ తిరగడం, ధన వ్యయం బంధనయోగం పొంచి ఉంది. తలనొప్పి, కంఠం సంబంధించి అనారోగ్య సూచనలు. నెలాఖరు నుంచి సుబ్రహ్మణ్య ఆరాధన, అభిషేకం ఉపశమనాన్నిస్తుంది.

**ఫిబ్రవరి**: వ్యవసాయం ఫలించి ధనాగమం అవుతుంది. కొత్తగా పారిశ్రామిక సంస్థలలో పెట్టుబడులు లేక వాటాలు తీసుకోవడం అవుతుంది. కుటుంబంలో వంశోద్ధారకుడు పుట్టే అవకాశం ఉంది.

**మార్చి**: తాత్కాలికంగా తక్కువ సమయంలో లాభాలు వచ్చే వ్యాపారాలు చేస్తారు. స్టాక్ మార్కెట్, షేర్ల వ్యాపారాలు కలిసిరావు. అధికంగా వృధాగా ధనం వెచ్చించవలసి వస్తుంది.






| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | 11 | వ్యయం | - | 5 |
| రాజపూజ్యం | - | 7 | అవమానం | - | 5 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు షష్ఠస్థానమందు గురుడు రజితమూర్తిగాను, శనైశ్చరుడు సంవత్సరమంతా తృతీయ స్థానమందు లోహమూర్తిగాను, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు చతుర్థ, రాజ్యస్థానములందు సువర్ణమూర్తులుగాను సంచరింతురు. ఆరోగ్యం బాగుంటుంది. గతంలో జరిగినదానికి నిరాశ చెందకుండా ధైర్యంతో వ్యవహరించడం, వృత్తి బలం పెరగడం, సంతానం కలిసిరావడం కార్యనిర్వహణ చేయడం ఇతరులకు తన వంతు సహాయం చేయడం, షష్ఠ స్థాన గురుడు క్లేశం కలుగజేస్తాడు. అక్టోబర్ నుండి జనవరిలలో షష్ఠ రాశియందు గురుని వక్రం సానుకూలమైన ఫలితాలనిస్తుంది.

వీరికి సంవత్సర ప్రారంభంలో తృతీయ స్థానమందలి కుజుడు ధైర్యాన్ని, ఉత్సాహాన్ని, ధనలాభాన్ని, సుఖాన్ని, ఎల్లప్పుడూ ఆరోగ్యాన్ని ఇస్తే, ఇదే స్థానమందున్న శనైశ్చరుడు స్వస్థానమును పొందుటవల్లను, స్వబుద్ధిచే ఉపక్రమించిన కార్యములు సిద్ధించునట్లు చేయును. తృతీయ స్థానమందలి కుజ శనుల స్థితిచేత, సోదరులతో సత్సంబంధాలను ధైర్యాన్ని సూచిస్తుంది. సంవత్సరారంభంలో సమస్యలు ఉన్న క్రమేపి శాంతిస్తాయి. వీరు కార్యభారాన్ని వహించి ధైర్యంగా నిర్దిష్ట లక్ష్యాలను సాధించగల సామర్థ్యాన్ని కలిగి ఉంటారు. వ్యాపారవిధానాలపై భాగస్వామ్యులపై నియంత్రణ కలిగి కఠినమైన నిర్ణయాలను తీసుకుని వ్యాపార సంస్థల ఎదుగుదలకు కృషి చేస్తూ ముందుకు నడిపించగల శక్తి మరియు సామర్థ్యం కలిగి యుంటారు. వాణిజ్యవేత్తలకు ఉత్పాదకత పెరగడం, ఆరోగ్యం మరియు స్వీయ-అభివృద్ధి లక్ష్యాలను మెరుగుపరుచుకునే గొప్ప అవకాశం లభిస్తుంది. విద్యార్థులు వైద్య విద్యకు సంబంధించి కృషిచేసివిజయం సాధించ గల్గుతారు. వైద్యులకు శాస్త్ర సాంకేతిక వృత్తి వారికి అనుకూల సమయం. వృత్తిలో రాణించి, విశేష ఆదరణ పొందుతారు. ప్రభుత్వాధికారులు తీసుకునే నిర్ణయాలు ప్రజలకు అనుకూలంగా ఉంటాయి. వారి పని నైపుణ్యాలు మరియు వారిపై అధికారులతో ప్రవర్తన కారణంగా ఉద్యోగోన్నతి అవకాశం ఉంది. రాజకీయనాయకుల నుండి ప్రశంసలు పొందుతారు. సాఫ్ట్‌వేర్ రంగంలో పనిచేసే నిపుణులకు గుర్తింపు వచ్చి, వారిని విదేశాలకు పంపవచ్చు. వైద్యులకు వృత్తి రీత్యా ముందంజ, సంతృప్తికరమైన సమాజసేవను చేస్తారు. సంఘంలో ప్రముఖ స్థానంలో గౌరవప్రదంగా చలామణి అవుతారు. ఆశించిన పనులు పూర్తవుతాయి. పేరు ప్రతిష్ఠలలో ముందంజ వేస్తారు. ఫైనాన్సు రంగ సంస్థలవారికి అధిక లాభాలతో బాకీలు వసూలవుతాయి. ఉద్యోగస్తులకు ఆర్థికంగా లోటుండదు. సహ ఉద్యోగులతో మర్యాద వహించడం మంచిది. రాహువు చతుర్థ స్థాన సంచార కాలం కావున ఆరోగ్యకరమైన అలవాట్లకు కట్టుబడి ఉండటం మంచిది. మూల

నక్షత్రంవారు అర్ధంకులను ఛేదించుటకు గణపతి ఆరాధన చేయదగినది. పూర్వాషాఢ వారి సంతానం వృద్ధి, చదువులో ముందంజ వేయడాన్ని ఆస్వాదిస్తారు. ఉత్తరాషాఢ వారు ధైర్యంతో కార్యసాధన చేస్తారు. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య '3'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్:** ధైర్యంతో ప్రణాళిక అమలు చేస్తారు. ప్రభుత్వం తరపు నుండి సన్మానాలు జరుగుతాయి గౌరవ మర్యాదలు పెరుగుతాయి. తన వలన అక్క చెల్లెళ్ళ అన్నదమ్ములకు అదృష్టం కలిసి వస్తుంది. కుటుంబ గౌరవం పెరుగుతుంది.

**మే:** సంపదలు స్థిరాస్తులు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతాయి. ధన వస్త్ర లాభములు, ఇష్టకార్య సిద్ధికల్గుతాయి. మీ కృషి శ్రమకు తగిన ఫలితమొస్తుంది. ఉద్యోగ వస్తుంది. వృత్తి విషయాలు అనుకూలంగా ఉంటాయి.

**జూన్:** ఆర్థికపరంగా చాలా అనుకూలమైన పరిస్థితి, కుటుంబ పరంగా మీకు మంచి మద్దతు లభిస్తుంది. సంతానం విషయాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పెట్టుబడులు మంచి ఫలితాలనిస్తాయి.

**జూలై:** ఉద్యోగపరంగా గుర్తింపు సంతృప్తికరమైన జీవనం సాగిస్తారు. ధనమునకు లోటుండదు. అప్పుడప్పుడు మానసికంగా క్షోభ ఇబ్బందులు పడుతూ ఉంటారు. అదృష్టం మిమ్మల్ని వరిస్తుంది.

**ఆగష్టు:** భౌతికపరమైన సుఖాలనుభవిస్తారు. అన్నిరకాల రుగ్మతల నుండి బయట పడతారు. భూమిని కొనుగోలు చేస్తారు. గృహనిర్మాణం గాని లేక కొనుగోలు చేయుటానికి చాలా అవకాశం ఉంది. ఆరోగ్యం బాగుంటుంది.

**సెప్టెంబర్:** మీరు పది మందికి అండదండలు ఉంటూ కార్యజయం పొందుతారు. భార్య, తల్లిదండ్రుల ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. కుజ సంచారం దోష నివారణకు సుబ్రహ్మణ్య ఆరాధన అభిషేకం ప్రదక్షిణాలు చేయాలి.

**అక్టోబర్:** ధైర్యం ప్రణాళిక పట్టుదలతో కార్యసిద్ధి కలుగుతుంది. అన్ని రకాల ప్రయత్నాలలోనూ జయం కలుగుతుంది. ఎంతటి కార్యాన్నైనా సులువు గా సాధిస్తారు. మంచి వక్తగా పేరు తెచ్చుకుంటారు.

**నవంబర్:** కార్యజయం ధనాభివృద్ధి ధనలాభం కల్గుతాయి. పెట్టుబడులు కలిసి వస్తాయి. ముఖ్యంగా చేనేత వస్త్ర, బట్టల వ్యాపారులకు ఈ సమయంలో ఆర్థిక లాభాలు అన్ని వృత్తుల వారికి సంతృప్తి కరంగా ఉంటుంది.

**డిసెంబర్:** దూర ప్రయాణాలు వాయిదా వేయుట మంచిది. మార్గావరోధాలు కలుగుతాయి. ఫ్లూ జ్వరాలు కండరముల నొప్పులువంటి అనారోగ్య సమస్యలు బారిన పడే అవకాశం ఉంది.

**2025 జనవరి:** అధికారహోదా పెరగడం, ఖర్చులు అధికమవుతాయి. ఆరోగ్యం సామాన్యం. గృహమున శుభకార్యాలు ఆలస్యమయ్యే అవకాశం ఉంది. వృత్తిపరంగా అనుకూలం.

**ఫిబ్రవరి:** కుటుంబ సభ్యులు బంధు మిత్రులతో సత్సంబంధాలు కలిగిఉంటారు. ధనాన్ని ఆకర్షిస్తారు. మీ పిల్లలు విద్యలలో రాణిస్తారు. తోబుట్టువులతో ఆనందంగా గడిపే అవకాశం కూడా ఉంది.

**మార్చి:** మీనరాశిలో శుక్రుని వక్రం కారణంగా విద్యా విషయాలలో శ్రద్ధ అవసరం. చదువుల్లో క్రమేపీ రాణిస్తారు. శోభాయమానంగా, వాక్చాతుర్యంతో ఆధునిక సమాచారం, నవీన విషయ పరిజ్ఞానంతో అందరినీ ఆకట్టుకుంటారు.






| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదాయం | - | 14 | వ్యయం | - | 14 |
| రాజపూజ్యం | - | 3 | అవమానం | - | 1 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు పంచమస్థానమందు గురుడు సువర్ణమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా ద్వితీయ స్థానమందు సువర్ణమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు తృతీయ, భాగ్యస్థానములందు రజితమూర్తులుగానూ సంచరింతురు. పంచమస్థాన గురుడు సత్సంతానవృద్ధి సంపదవృద్ధి, ఆర్థికంగా ఎదుగుదల ఆర్థిక పరిపుష్టి, స్టాక్ మార్కెట్లను ఆకర్షించి విశేషమైన లాభాలను పొందుతారు. గృహమున ముఖ్య శుభ సందర్భం ఉంటుంది, బంధు మిత్రులందరూ సమాగమునవుతారు. నూతనంగా గృహమందు భాముడుదయిస్తాడు. అన్ని రకాల వృత్తుల వారికి అన్నిరంగాల పనిచేసే వారికి జన్మరాశి రీత్యా పంచమ రాశిలో సువర్ణమూర్తివంతుడైన గురుడు అదృష్టాన్ని కలిగిస్తాడు. విద్యార్థులు ఉన్నత చదువులకై ఇతరదేశాలకు వెళ్ళే అవకాశం కల్గుతుంది. ఇప్పటికే ఇతరదేశాల్లో చదువు పూర్తి చేసినవారికి ఉన్నత ఉద్యోగావకాశాలు, ఉద్యోగం ఇప్పటికే పొందినవారికి కళ్యాణాది శుభయోగములు, సత్సంతానం సిద్ధిస్తాయి.

మకర రాశివారు అప్రమత్తంగా ఉండి ఆర్థిక విషయాలలో క్రమశిక్షణ కలిగియుండటం అవసరం. వృత్తి వ్యాపారాలలో ఆశించిన ఫలితాలు దక్కుతాయి. మీ స్వంత ఇంటిని మరియు సంపద మరియు కుటుంబాన్ని ప్రభావితం చేస్తుంది. ఉద్యోగస్తులకు వేతనాల పెంపు ఖరారవుతుంది. మీరు అన్ని రంగాలలో ఆశించిన విశేష అభివృద్ధిని అనుభవిస్తారు. సంతానం కూడా ఆశించిన ప్రతిభ కనబరచి అండగా ఉంటారు. మీరు మీ సంతానానికి ప్రేరణ కలగజేయడం ద్వారా వారి వృద్ధికి తోడ్పడతారు. సమాజంలో మీ స్థానం కూడా మెరుగుపడుతుంది. పెట్టుబడి మరియు స్పెక్యులేషన్‌లో లాభాన్ని ఆశించేందుకు ఇది మంచి సమయం. మీ ఆర్థిక స్థితి కూడా మెరుగుపడే అవకాశం ఉంది. ఉద్యోగ విషయాల్లో ఎప్పటినుంచో సమస్యలు ఎదుర్కొనువారికి న్యాయసహాయం అర్థించే వారికి అనుకూల సమయం. కోర్టు వ్యవహారాలు లిటిగేషన్ నుంచి విముక్తి అవుతారు.

స్వయం వృత్తులవారికి, ఇండస్ట్రీలు సాంకేతిక ఇంజనీరింగు రంగం వారికి, న్యాయవాద వృత్తులవారికి, ధాన్యం కొనుగోలు రైసు ఇండస్ట్రీల వారికి, కర్మాగారాలు నడిపేవారికి సాంకేతిక నైపుణ్యత గలవారికి చాలా ప్రయోజనకరమైన సమయం. సాధారణంగా ద్వితీయస్థానమందలి శనైశ్చరుడు స్థానరీత్యా సామాన్య ఫలితాలను క్రమేపీ మంచి ఫలితములను ఒసగుచున్ననూ, ఇక్కడ వీరికి సువర్ణమూర్తివంతముచే సర్వత్రా శుభఫలితములను ఇచ్చును. ఉత్తరాషాఢ నక్షత్రం వారు మెరుపులు మెరిపిస్తూ విజయములు పొందుతారు, శ్రవణం నక్షత్రం వారు స్ఫూర్తితో మరియు

ప్రజవాత్మకతతో నిండి ఆశించిన ఫలితములు పొందుతారు. ధనిష్ఠ వారికి ఋణవిమోచన కల్గుతుంది. ఈ రాశి వారి అదృష్ట సంఖ్య - '8'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్ :** సంఘంలో పలుకుబడి, ఆరోగ్యంతో ధైర్యంగా కార్యభారాన్ని వహిస్తారు. ఉద్యోగస్తులకు పదోన్నతి, వ్యాపారస్థులకు ధనలాభం కలుగును. ఇతరదేశ ప్రయాణాలు లేక దూర ప్రయాణాలు కలసివస్తాయి.

**మే :** వృత్తి ఉద్యోగాలలో పూర్తి సంతృప్తి. ఆర్థిక పరిపుష్టి. కొత్త పథకాలకు శ్రీకారం చుడతారు. ధైర్య సాహసాలను ప్రదర్శించి అందరి ప్రశంసలు పొందుతారు. అంటువ్యాధులు, అగ్ని సంబంధ వ్రణములకు అస్వస్థకు గురయ్యే అవకాశం ఉంది.

**జూన్ :** వ్యక్తిగత జీవితం సమస్యలతో కూడి ఉంటుంది. స్టాక్ మార్కెట్లలో పెట్టుబడులు,స్పెక్యులేషన్ పనికిరావు. నెల రెండవభాగంలో మంచి ఆదాయం పై అధికారులతోనూ, సహచరులతోనూ సత్సంబంధాలు ఉంటాయి.

**జూలై :** ఉత్తమ ఫలితాలను ఆశించలేరు. మానసిక శారీరిక ఒత్తిడితో ఉంటారు. స్త్రీలతో సంభాషణ సమయంలో జాగరూకతతో ఉండాలి. నోటిని అదుపు ఉంచడం మంచిది. ఆర్థిక విషయాలు సామాన్యం.

**ఆగష్టు :** విజయాన్ని వరిస్తుంది. న్యాయవాదులు లేక ఈ రాశిలోని ఎవరైనా మీ అమోఘమైన వాగ్ధాటి వలన ఇతరులను కష్టం నుంచి బయట పడేయొచ్చు. సాంఘికంగా గౌరవప్రదమైన స్థానంతో పురోగమనం సాధిస్తారు.

**సెప్టెంబర్ :** ఉన్నతమైన ఆశయములే మిమ్ములను ముందుకు నడిపిస్తాయి. ఒక ఆహ్లాదకరమైన జీవనశైలికి అలవాటు పడతారు. బంధు మిత్రుల ప్రశంసలు. పరిచయం పిడికెడు ధనం అన్నట్లు మంచి మిత్రుల అండ మీకుంటుంది.

**అక్టోబర్ :** ప్రారంభంలో అధిక ఖర్చులు, ముక్కు, గొంతు, చెవి వైద్యుల సహాయం అవసరమవుతుంది. వస్త్రాలు, నిత్యకృత్య అవసరములు కొనుగోలు చేస్తారు. ఆకస్మిక ధనలాభాలు వరిస్తాయి. శత్రువుల జాబితా కూడా పెరిగే అవకాశం ఉంది.

**నవంబర్ :** సాంఘిక కార్యకలాపాల్లో ఆధ్యాత్మిక విషయాల్లో పాల్గొంటారు. మీ దాతృత్వాన్ని ప్రదర్శిస్తారు. అనేక రకాలుగా ఆదాయం పెరుగుతుంది. మీ వ్యక్తిగత విలువ పెరుగుతుంది. పెట్టుబడులు కలసివస్తాయి.

**డిసెంబర్ :** వ్యవసాయ దారులకు కలసివచ్చే సమయం. శత్రువులపై జయం వారిని అణగదొక్కుతారు. వృత్తి ఉద్యోగాలలో గౌరవం, ఆర్థిక పరిపుష్టి కుటుంబ వృద్ధి అవుతుంది. వ్యాపారాలలో ముందంజ ఆర్థిక లాభాలు వస్తాయి.

**2025 జనవరి :** గతం నుంచి పేచీలలో సాగుతున్న వైవాహిక బంధాలు ఒక కొలిక్కి వస్తాయి. విముక్తులవుతారు. సహనాన్ని అలవరచుకోవడం ఈ సమయంలో సరైన పని.

**ఫిబ్రవరి :** విద్యార్థులు వక్తృత్వపు పోటీలలోనూ, చర్చావేదికలలో రాణించి బహుమతులు గెలుచుకుంటారు. వ్యక్తిగతంగా విలువ పెంచుకోవడం అంటే ఇదే. ఉద్యోగ నియామకపు పరీక్షలలో నెగ్గుతారు.

**మార్చి :** గృహమున సంతానం విషయంలో శుభ వార్తలు వింటారు. జీవనం ఆనంద మయంగా ఉంటుంది. దూర ప్రాంతాలకు వెళ్లవలసి వస్తుంది. విదేశీ ప్రయాణాలు కలసి వస్తాయి. స్నేహితుల తోడ్పాటు మీకు ఉంటుంది.






| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 14 | వ్యయం | - 14 |
| రాజపూజ్యం | - 6 | అవమానం | - 1 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు చతుర్థస్థానమందు గురుడు లోహమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా జన్మరాశి యందు తామ్రమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరమంతా ద్వితీయ, అష్టస్థానములందు లోహమూర్తులుగానూ సంచరింతురు. చతుర్థ స్థానమందు గురుడు యుండుట వీరికి నూతన గృహ నిర్మాణాలు వీరికి కలసివస్తాయి. కఠోరపరిశ్రమ చేసి ధనం సంపాదిస్తారు. ఆర్థిక స్థిరత్వం సాధిస్తారు. ఉద్యోగస్తుల విషయంలో స్థానమార్పు బదిలీలు తప్పవు. ఇంటికి స్నేహితులకు మరియు కుటుంబానికి దూరంగా నివసించ వలసి ఉంటుంది మరియు ఒక రకమైన దీనత్వంలో జీవనం గడపవలసి ఉంటుంది. గృహ నిర్మాణాదులు చేయటం లేదా స్థిర నివాసం ఏర్పాటు చేసుకొనే పనిలో నిమగ్నమై యుండుట, ఉద్యోగస్తులకు స్థానమార్పు మరియు పనివత్తిడి అనుభవించ వలసి యుంటుంది. యోగాభ్యాసము ఆధ్యాత్మిక చింతనలో కాలక్షేపము చేసి కొంత వరకు జీవనంలో ఒడిదుడుకులను అధిగమించగల్గుతారు. సంపాదన ధనవ్యయం రెండు సమపాళ్లలో ఉంటాయి. మీ బంధువులు మరియు కుటుంబ సభ్యులతో స్నేహపూర్వకంగా ఉండటానికి ప్రయత్నించాలి. ఆస్తి పంపకాలు ఆర్థిక వ్యవహారాల విషయంలో సంయమనము పాటించి ప్రస్తుతానికి వాయిదా వేయడం మంచిది. ఆర్థిక సమతుల్యతను సాధించడానికి దుబార ఖర్చులను తగ్గించుకోవాలి. విందులు వినోదాల విషయంలో స్వీయ నియంత్రణ అవసరం. ప్రయాణాలలో మార్గవరోధాల వలన అప్రమత్తతగా ఉండి తగిన ప్రణాళికను సిద్ధం చేసుకోవాలి. తల్లితో మీ సంబంధం కూడా దెబ్బతింటుంది కాబట్టి జాగ్రత్తగా ఉండండి. స్థానమార్పు నూతన గృహ నిర్మాణం లేదా కొనుగోలు కలసి వస్తాయి.

శని స్వక్షేత్రంలో సంచారం ఈ రాశిలో ఎవరికైనా ఏ వృత్తి వారికైనా మిశ్రమ ఫలితాలనిస్తుంది. వ్యాపారాలలో ఉత్థాన పతనాలు, వైద్య సహాయం కొరకు ఆసుపత్రిలో చేరడం అయితే మీకు దైవబలం వెన్నంటి ఉంటుంది. మీకు ఆశించిన ఫలితాలు కల్గుతాయి. మీ కెరీర్ స్థిరత్వం కల్గుతుంది. వృత్తిపరమైన ఆధిక్యతను ప్రదర్శించి అందరి మన్ననలను పొందుతారు, మీ సహోద్యోగుల గౌరవాన్ని పొందుతారు. వచ్చే సంవత్సరాలలో సంపాదించే ధనాన్ని భౌతిక సుఖాన్ని అనుభవించేందుకు ఈ సంవత్సరం కఠోర పరిశ్రమ ద్వారా సాధించి స్థిరత్వాన్ని పొందుతారు. గృహ నిర్మాణ సమయంలో సంపాదించిన సొమ్ము చోరుల పాలవకుండా తగిన జాగ్రత్తలు అవసరం. వాదనలు చేయడం అనవసరం. మత్స్య వ్యవసాయ రంగం వారికి ఈ సంవత్సరం గతం కంటే మంచి ఫలితాలుంటాయి. ధాన్యం కొనుగోలు వ్యాపారస్తులకు మిశ్రమ ఫలితాలు. పౌల్ట్రీ రంగం వారికి సామాన్యం. స్థిరాస్తి వ్యాపారులకు,

లుంటాయి. ధనిష్ఠ నక్షత్రం వారికి ఉద్యోగంలో ఉన్నతి, శతభిషం వారికి విద్యా ఉద్యోగ విషయాలలో ముందంజ పూర్వాభాద్ర వారికి చేసే పనిలో ఏకాగ్రత మంచి వ్యక్తిత్వం పొందుతారు. ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 8.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్ :** వృధాగా కాలయాపన చేస్తూ చేతికి చిక్కిన అవకాశాలను జారవిడుచుకుంటారు. ప్రతిబంధకాలను అధిగమించుటకు శక్తి యుక్తులను కూడగట్టుకునే ప్రయత్నం అవసరం.

**మే :** క్రమేపీ స్వీయవృద్ధిని సాధిస్తూ స్థిరత్వాన్ని పొందుతారు. గతం నుంచి గుణపాఠాలు నేర్చుకుని విశ్రాంతిగా యోగాభ్యాసం చేస్తూ ఏకాగ్రత సాధిస్తూ మరియు సుఖ జీవనం చేస్తారు. ఆధ్యాత్మికంగా ఉంటారు.

**జూన్ :** మీ ప్రయత్నాలు మంచి ప్రతిఫలాలను ఇస్తాయి మీకు మరింత ప్రేరణను ఇస్తుంది. శరీర సత్తువ మరియు ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. దీర్ఘకాలిక వ్యాధుల నుండి ఉపశమనం జీవితంలో కొత్త దృక్పథాన్ని పొందుతారు.

**జూలై :** చదువుల్లో ప్రతిభా పాటవాలతో రాణిస్తారు. కొత్త విషయాలను నేర్చుకునే ఆసక్తితో కృషి చేసి కొత్త నైపుణ్యాలను నేర్చుకుంటారు. పోటీ పరీక్షలలో ఖచ్చితంగా విజయం సాధ్యమవుతుంది,మీ ప్రయత్నాలను ముమ్మరం చేస్తారు.

**ఆగష్టు :** ఇది ఆదాయ వృద్ధికి కొత్త అవకాశాలను తెస్తుంది. రియల్ ఎస్టేటు రంగంలో పెట్టుబడులు అనుకూలంగా ఉంటాయి. అందరూ ఆరోగ్యంగా ఉండి జీవిత భాగస్వామి మరియు కుటుంబ సభ్యుల ఆనందాన్ని చూస్తారు.

**సెప్టెంబర్ :** చెడు సహవాసాలకు దూరంగా ఉండటం మంచిది. సహోద్యోగులతో వివాదాల నుండి తెలివిగా తప్పించుకుంటారు. విద్యార్థుల ప్రయత్నాలు తీవ్రతరం చేస్తారు. కృషి మరియు శ్రద్ధ అవసరాన్ని గుర్తిస్తారు.

**అక్టోబర్ :** మీ సామాజిక స్థితి పెరుగుతుంది. విలాసవంతమైన జీవనశైలిని అనుభవిస్తారు. పిల్లల వ్యవహారాలు కూడా సజావుగా సాగుతాయి. తెలివైన నిర్ణయాలు తీసుకునే సమయస్ఫూర్తిని కలిగి ఉంటారు.

**నవంబర్ :** మెరుగైన విజ్ఞానాన్ని శిక్షణ పొంది ప్రొఫైల్‌ని వృద్ధి చేసుకుంటారు. అన్ని వృత్తుల వారు మంచి ఆదాయాన్ని పొందుతారు. మీరు చాలా మానసిక శాంతిని పొంది వ్యతిరేక శక్తులను అధిగమించి విజయాన్ని పొందుతారు.

**డిసెంబర్ :** అభివృద్ధి మరియు లాభాలను పొందే శుభ తరుణం ఇది. ఈ కాలంలో కూడా ఉద్యోగం విషయంలో ఉన్నతి అంటే ప్రమోషన్ మరియు జీతం పెంపు కల్గుతుంది. కొత్త అవకాశాలను పొందుతారు.

**2025 జనవరి :** పై అధికారులు మిమ్ములను ప్రశంసిస్తారు పలుకుబడి గుర్తింపు పొందుతారు. కుటుంబం మరియు స్నేహితులు మిమ్మల్ని గౌరవిస్తారు. సామాజిక పరంగా కూడా ప్రశంసలు పొందుతారు. ఆరోగ్యం అనుకూలం.

**ఫిబ్రవరి :** ఈ సమయం వృత్తి వ్యాపారాలలో అనూహ్యమైన అవకాశాలను లాభాలను తెస్తుంది. ఆర్థిక స్థితి మెరుగుపడుతుంది. ఆరోగ్య విషయాలు కూడా అనుకూలం. దూరపు ప్రయాణాలు కలిసి వస్తాయి.

**మార్చి :** గృహోపకరణాలు అలంకరణ వస్తువులు రత్నాలు మరియు ఆభరణాల కొనుగోలు కోసం మీ డబ్బును ఖర్చు చేసే అవకాశం ఉంది. సంగీతం పట్ల అభిరుచి ఆసక్తి పెంచుకుంటారు. విందు వినోదలలో పాల్గొంటారు.






| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 11 | వ్యయం | - 5 |
| రాజపూజ్యం | - 2 | అవమానం | - 4 |

ఈ రాశి వారికి మే 1 నుండి సంవత్సరాంతం వరకు తృతీయస్థానమందు గురుడు సువర్ణమూర్తిగానూ, శనైశ్చరుడు సంవత్సరమంతా వ్యయస్థానమందు రజితమూర్తిగానూ, రాహుకేతువులు సంవత్సరారంభం నుండి సంవత్సరాంతము వరకు జన్మ, సప్తమస్థానములందు తామ్రమూర్తులుగానూ సంచరింతురు. తృతీయ మందలి గురుడు కార్యనాశనాన్ని కలుగజేస్తాడు.

బృహస్పతి జన్మరాశికి 3వ స్థానమైన వృషభంలోనికి ప్రవేశించినపుడు, మీనరాశి వారు జీవితంలో కొన్ని సవాళ్లను ఎదుర్కొంటారు. కొన్ని రకాలుగా అడ్డంకుల కారణంగా వ్యాపార వ్యవహారాలు అంతంత మాత్రంగానే ఉంటాయి. కొంత ధననష్టం కుడా జరిగే అవకాశం ఉన్నందున ఆర్థికపరంగా ఇది అనుకూల సమయం కాదు. ఉద్యోగస్తులు పైఅధికారులతోనూ, ప్రైవేటు రంగ సంస్థల ఉద్యోగస్తులు వారి యజమానుల నుండి సమస్యలను అధిగమించవలసి వస్తుంది. తృతీయ స్థానానికి కారకులైన తోబుట్టువులు మరియు స్నేహితులతో సత్సంబంధాలను కృషిచేసి స్థిరపరచుకోవలసి వస్తుంది. ఆరోగ్య విషయాలలో చాలా జాగ్రత్తగా ఉండాలి. ఆధ్యాత్మిక పరమైన విషయాలలో మీవంతు సాయం అందిస్తారు. దాన ధర్మాలు చేస్తారు. ఆధ్యాత్మిక విషయమై దూర ప్రాంతాలకు వెళ్లవలసి ఉంటుంది.

మీనరాశి వారికి ఈ సంవత్సరమంతా జన్మ, సప్తమ రాశిలోనూ లోహ మూర్తులుగా ఆశించిన ఫలితాలు కలుగకపోగా అనేకమైన సవాళ్లను ఎదుర్కొనవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాలు సామాన్యం, అయితే వైద్య వృత్తివారికి, ఔషధ కంపెనీల వారికి, తోలు ఉత్పత్తి మరియు వినిమయ సంస్థలకు, విషనాశక ఔషధముల తయారీ సంస్థల వారికి, పరధాన్యాల వర్తకులకు, మత్స్య, మాంస ఉత్పత్తిదారులకు విశేషమైన ఫలితాలు కల్గుతాయి. చెడు స్వభావము గలవారికి, మత్తు పదార్థాలను సేవించేవారికి, జూద వ్యభిచార గృహాలను సందర్శించే వారికి, చీకటి మార్గాల ద్వారా డబ్బు సంపాదించే వారికి, నిజాయితీగా లేనివారికి వారి తెరవెనుక భాగోతాలు బయటపడే అవకాశం ఉంది.

సప్తమ స్థాన స్థిత కేతువు యొక్క చేదు ఫలితాలైన ఆరోగ్య సమస్యల నుండి బయట పడుటకు, మానసికంగా ఒత్తిడిని అధిగమించుటకు క్రమపద్ధతి లో కాలినడక, యోగాభ్యాసము, రోజూ చేయాలి ఆంజనేయ స్వామి వారి స్తోత్రములు నిత్యము పఠించుట వలన సైదుష్ఫలితముల నుండి బయట పడవచ్చు. వైవాహిక జీవితంలో కూడా చాలా అన్యోన్యతతో కూడి గందరగోళాలు లేకుండా ఉంటుంది. ఆర్థిక సమతుల్యతను కాపాడుకోవడానికి మీరు ఖర్చులను తగ్గించుకునే దిశగా పని చేయాలి. పూర్వాభాద్ర వారు అందరి మన్ననలను పొందుతారు. ఉత్తరాభాద్ర వారు

సత్కార్యాచరణ చేసేవారుగానూ రేపటి వారు ధార్మత్వం కలిగి స్థిరమైన ఆలోచనలు కలిగిఉంటారు. ఈ రాశివారికి అదృష్ట సంఖ్య- '3'.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్ :** అసహనానికి, తొట్రుపాటుకి గురి అవ్వడం, క్రమశిక్షణ, అవగాహన రాహిత్యము ఉంటుంది. తల్లిదండ్రులతోనూ కుటుంబ సభ్యులతోనూ వాగ్వివాదాని దిగకుండా సంయమనం అవసరం.

**మే :** దూర ప్రాంతాలకు వెళ్లవలసి ఉంటుంది. గురుబలం లేకపోయినను అద్భుతమైన వాగ్ధోరణితో ఇతరులను ప్రభావితం చేయగలరు. ముఖం కళతప్పి ఉండటం అధిక ధన వ్యయం.

**జూన్ :** ఉద్యోగములో కొత్త బాధ్యతను స్వీకరించుట,అమోఘమైన వాక్పటిమను ప్రదర్శించుట, ఇతరులపై గెలుచుట దీర్ఘవ్యాధులకు ఆసుపత్రిలో చికిత్సలు చేయించుకోవడం బంధనయోగం, చర్మవ్యాధులు.

**జూలై :** గృహమును విడిచి ఇతర చోట్ల నివసించవలసి వచ్చుట,చర్మ వ్యాధులకు గురి అవ్వడం వంటి ఫలితాలు గోచరిస్తాయి.ఈ మాసంలో స్థిరాస్తి సంబంధ క్రయ విక్రయములు చేయుట వాయిదా వేయుట మంచిది.

**ఆగస్టు :** జ్ఞానం వృద్ధి చేసుకుంటారు ఈ విషయం లో అనేక రకములుగా పరామోజనం పొందుతారు. అన్నీ వృత్తులవారికి ప్రోత్సాహకరమైన వాతావరణం మరియు పురోగతినిఉంటుంది.

**సెప్టెంబర్ :** ప్రయత్నాలన్ని విజయవంతమవుతాయి. వ్యాజ్యాల విషయాల్లో ఉపశమనం కనిపిస్తుంది. సంపాదన మెరుగుపడుతుంది. వాహనం, సంపద మరియు విలాసవంతమైన సౌకర్యాలతో జీవనశైలి సంపన్నంగా ఉంటుంది.

**అక్టోబర్ :** మానసిక వేదన,గుండె, ఊపిరితిత్తుల సమస్యలు వచ్చే అవకాశం.కుజుడు అర్దాష్టమ సంచార ప్రభావాన్ని అధిగమించేందుకు సుబ్రహ్మణ్య ఆరాధన మంచిది. కొత్త ప్రణాళికు దూరంగా ఉండండి.



**నవంబర్ :** విద్యార్థులకు చదువుల్లో పురోగతి,స్పష్టతగా చురుగ్గా ఉంటారు. మానసిక ప్రశాంతత,అదృష్టం దురప్రయాణాలు కలసిరావడం.ప్రభుత్వం నుంచి సబ్సిడీలు ప్రోత్సాహకాలు వస్తాయి.అధ్యాత్మికంగా రాణిస్తారు.

**డిసెంబర్ :** స్నేహితుల నుండి మద్దతు మరియు అన్ని ప్రయత్నాలలో విజయం పొందురారు. సంపద వృద్ధిని సూచిస్తోంది. ఆర్థిక సమస్యల నుండి బయటపడతారు. సమాజం లో మెరుగైన స్థానం మరియు ఆనందాన్ని అనుభవించే సమయం.

**2025 జనవరి :** జీవితం ఉల్లాసంగా ఉంటుంది. సంతృప్తికరమైన ఆదాయాన్ని వృద్ధిని పొందుతారు. జీవిత భాగస్వామితో మీ సంబంధం కూడా మధురంగా ఉంటుంది. మానసిక ప్రశాంతత లభిస్తుంది. మీ సంకల్ప శక్తిని పెంచుతుంది.

**ఫిబ్రవరి :** మీ సోదరులు మరియు స్నేహితులు మీ బలానికి మూలస్తంభాలు అవుతారు. మీలోని సృజనాత్మక శక్తి పెరిగి రాణిస్తారు. అధిక ఆదాయాన్ని పొందుతారు. మీ సామాజిక స్థితి బాగుంది ఊహించని లాభాలను తెస్తుంది.

**మార్చి :** స్వీయ నియంత్రణ విధించుకుని ఇతరులతో సత్సంబంధాలు మెరుగు పరచుకుంటారు. పెళ్లి, ప్రేమ విషయాలలో భావోద్వేకానికి గురి అవ్వవలసి వస్తుంది. విద్యార్థులు ఫార్మసీ, వైద్యవిద్యకు సంబంధించిన చదువులలో ప్రావీణ్యత గడిస్తారు.